







The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 236 MONDAY 29th NOVEMBER 1948 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# స్వరక్షణకైనా అమెరికా చైనాకు వెంటనే సహాయం చేయాలి

## గ్రీసు సమస్యలపై ఐక్యరాజ్య సమితి సమగ్ర తీర్మానములు

### కమ్యూనిస్టు గెరిల్లాలకు బాల్కన్ రాజ్యాలు తోడ్పడరాదని హెచ్చరిక

పారిస్, నవంబరు 27: గ్రీసులో ప్రభుత్వంపై విప్లవ యుద్ధం నడిపించుచున్న కమ్యూనిస్టు గొరిల్లాలకు చుట్టుప్రక్కల నున్న బాల్కన్ రాజ్యములు సహాయము చేయరాదని ఐక్యరాజ్య జనరల్ ఎసెంబ్లి నేడు ఒక తీర్మానములో ఆదేశించినది.

పశ్చిమరాజ్యాలు ప్రతిపాదించిన ఈ తీర్మానమునకు 47 ఓట్లు అనుకూలంగా 6 వోట్లు ప్రతికూలంగా వచ్చినవి.

గ్రీసు, యుగోస్లావియా, ఆల్బేనియా, బల్గేరియాలు తమలో తాము రాజకీయ సంబంధములను, సరిహద్దు నిబంధనలను తిరిగి స్థాపించుకోవలసినదిగా మరొక తీర్మానముగూడ ఏకగ్రీవంగా ఎసెంబ్లీ ఆమోదించినది.

ఈ సలహాలను, తీర్మానములను ఏవిధంగా ఆచరణలో పెట్టుచున్నారో కూడ తమకు 6 నెలలలో నివేదించవలెనని ఎసెంబ్లీవారు పైనాలుగు ప్రభుత్వములకు ఆదేశించిరి.

గ్రీసునుండి గొరిల్లాలచే బాల్కన్ రాజ్యములలోని కత్తుకుపోబడి, తల్లిదండ్రులచే కోరబడుచున్న పసిబిడ్డలను, తిరిగి గ్రీసుకు పంపివేయవలెననికూడా మరొక తీర్మానములో ఆదేశించబడినది

### విషిన్స్కీ ఆరోపణలు

బాల్కన్స్ కమీషన్ సభ్యులు, అసమర్థులు, అవివేకులు, అన్యాయాపరులని నేడు సోవియెట్ ఉపవిదేశాంగమంత్రి విషిన్స్కీ నిందించెను.

సమితిచే నియోగింపబడిన ఈకమీషన్ వారు బాల్కన్ రాజ్యాలకు ప్రతికూలంగా అబద్ధపు సాక్ష్యములను సేకరించిరని, నమ్మదగని సాక్షులను విచారించిరనీ, కనుక నిజమైన సాక్ష్యము నే పరిశీలింపవలెననీ అతడు ఉద్ఘాటించెను.

## దక్షిణాఫ్రికా భారతీయసమస్య

### "సమితి తక్షణం విచారించాలి"

### యూనియన్ ప్రతినిధి వైఖరి

పారిస్, నవంబరు 27: దక్షిణాఫ్రికాపై ఇండియా చేసిన ఆరోపణలను ప్రస్తుత పారిస్ సమావేశంలోనే చర్చించి ముగించాలి కాని, మరో ఏడాదివరకూ నెట్టివేయరాదని దక్షిణాఫ్రికా పట్టుబడుతుందని తెలియుచున్నది.

భారతీయ సమస్యపై మంచి నిపుణులైన వారిని ఏరి, వారికెంతో భత్యములు, వేతనములు యిచ్చి దక్షిణాఫ్రికా పారిస్ పంపినదనీ, యిది అంతా వ్యర్థమైపోతుందనే భయంతోనే ఈ సమస్యపై చర్చలను వాయిదా వేయరాదని దక్షిణాఫ్రికా పట్టుబడుతున్నదని కూడా తెలియుచున్నది.

సమితి వారిముందు ఇంకా 30 లెడు సమస్యలు ఎజెండాలోని కెక్కియున్నవి. ఇవి యింకా చర్చలకు రానేలేదు. అన్నిటికీ అడుగున భారతీయ సమస్య పడియున్నది. పాలస్తీనా, కొరియా, ఇటాలియన్ వలసలు, స్పెయిన్ ఇంకా అల్లాగే వున్నవి.

## అమెరికా కాంగ్రెస్‌కు చైనా శాసనసభ విజ్ఞాపన

### చాంగ్‌కైషేక్‌ను ఆహ్వానించుటకు ట్రూమన్ అధ్యక్షుని నిరాకరణ

నాన్‌కింగ్, నవంబరు 27: చైనా అంతర్యుద్ధములో ప్రభుత్వసేనలు అపజయము పొందకుండుట అమెరికాకే లాభము కనుక సత్వర సహకారము చేయవలసినదని చైనా పార్లమెంటు అమెరికా కాంగ్రెసుకు విన్నపము చేసెను.

అమెరికా చైనాకు సహాయము చేయవలెననియు జనరల్ క్లేర్‌షెనాల్టు నాయకత్వము కింద అమెరికను "ఫ్లైగర్" యుద్ధ విమానదళము ప్రభుత్వసేనలతో కలిసి యుద్ధము చేయవలెననియు పీపింగులోని ఏడు అధికార సంఘములవారు తీర్మానించిరి:

కాని ప్రభుత్వ సేనలలో కలిగిన నైతిక భ్రష్టత తొలగనిచో అమెరికనులు సహాయపడినను అపజయము తప్పదని భావింపబడుచున్నది. ఓడిపోయిన మంచూరియా సైనికులలో మిగిలినవారు నేడు టీన్‌ట్సిన్‌లో ప్రదర్శనములు చేసిరి. వారు తమ దుర్భరస్థితిని గురించి చెప్పుకొనిరి. ఒక సైనికుని శవమును వీధికడ్డముగాపెట్టి, వాడు సరిఅయిన చికిత్స లేక చనిపోయెనని దారిన పోవువారికి చెప్పసాగిరి.

### అమెరికా అధికార వర్గాల వైఖరి

వాషింగ్టన్, నవంబరు 28: చాంగ్-కై-షేక్‌ను వాషింగ్టన్‌కు ఆహ్వానించుటకు ట్రూమన్ అధ్యక్షుడు నేడునిరాకరించెను.

మదాం చాంకైషేక్ అమెరికన్ సహాయమును స్వయముగా అర్థించుటకు షాంఘైనుండి రేపు ఒక విమానములో బయలుదేరి బుధవారమునకు వాషింగ్టన్‌కు రాగలదని అమెరికన్ విదేశాంగ కార్యాలయం నేడు ప్రకటించినది.

అమెరికా ఆమెను ప్రత్యేకంగా ఆహ్వానించినదో లేక తనంతతానే ఆమె వచ్చుచున్నదో తెలియుటలేదు. కాని యిటీవల జార్జి మార్షల్ చేసిన ప్రకటనలను బట్టి ఆమెతో అమెరికన్ అధికారులు చాల ముభావముగా చర్చలు జరుపుదురని ఊహింపబడుచున్నది.

చైనా అంతర్యుద్ధపు ఊబిలో మరీ మొలబంటివరకూ దిగబడుటకు అమెరికా సిద్ధముగా లేదనీ, అందుచే అమెరికా కొంత వెనుక ముందు లాలోచించి మరీ సహాయం చేయునని జార్జి మార్షల్ ఇటీవల స్పష్టీకరించెను.

టోకియో, నవంబరు 27: ఐదు వేల టన్నుల సిమెంటుతో ఒక జపాన్ నౌక డిసెంబరు 5 న ఇచ్చటనుండి ఇండియాకు బయలుదేరుతుంది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము ఇండియాకు వచ్చుచున్న మొదటి జపాన్ ఓడ ఇదే. దీనిపేరు టాట్సు నిచీమారు' ఇది రాళ్ళని బొగ్గుతో తిరిగి జపాను వెళ్ళగలదు.

## నెలకు 20 వేల వేతనము చాలని రాజాజీ సూచన

### కేంద్ర ప్రభుత్వాలోచన.

న్యూఢిల్లీ, నవంబరు 28: భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్‌పటేల్ యు.పి. తూర్పుమండలాల కాంగ్రెస్ ప్రచారకులు ఇక్కడ నిన్న సమావేశమైనప్పుడు ప్రసంగించుచూ, గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు తమ వేతనముక్రింద, ఇతర ఖర్చులక్రింద నెలకు 20 వేల రూపాయలు మించి వ్యయపరుచుటకు తను (రాజాజీ) సమ్మతించజాలనని కేంద్ర ప్రభుత్వమునకు వ్రాసినట్లు చెప్పిరని తెలియుచున్నది. రాజాజీ సూచనను కేంద్రప్రభుత్వము ఆలోచించుచున్నదనీ ఇంకా ఏ నిర్ణయమునకూ రాలేదనీ పటేల్‌గారు కాంగ్రెస్ ప్రచారకులకు చెప్పారట.

సర్దార్ పటేల్ గారు నిన్న అలహాబాద్‌లో సర్ తేజ్ బహదూర్‌సప్రూగారిని దర్శించిరి. (యు. ప్రె.)

## స్వతంత్రప్రతిపత్తికి భంగం కలుగని కామన్వెల్తు సభ్యత్వం

### బ్రిటన్ భారతదేశ భవిష్యత్సంబంధాలపై ప్రధానమంత్రి పండిట్‌నెహ్రూ అభిప్రాయం

న్యూఢిల్లీ, నవంబర్ 27: రాజ్యాంగ నిర్మాణ సభలోని కాంగ్రెస్‌పార్టీ సమావేశమునందు ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ కామన్‌వెల్తు సంబంధముల సమస్యను చర్చకు తెచ్చినట్లు రూఢిగా తెలియుచున్నది. ఈ సమస్యను విపులీకరించుచూ కామన్వెల్తుతో పొత్తుకలిగి యుండుటవలన కలుగు సాధకబాధకముల నన్నిటినీ ప్రధాని సభికులకు వివరించి చెప్పిరి.

ప్రధాని వివరించిన తదుపరి, సభికులెల్లరూ, యీ విషయమును వారి దీర్ఘముగా చర్చించిరి. కాని స్పష్టమైన దృక్పథమేదియూ తేలినదికాదు.

అలహాబాదునుండి, పటేలుగారు తిరిగి వచ్చిన యనంతరము తిరిగి యీ విషయమై చర్చింపబడునని తెలియుచున్నది.

ఈ సమావేశమునకు డాక్టర్ పట్టాభిగారు అధ్యక్షత వహించిరి.

మన సార్వభౌమతకు భంగమురాని విధమున, కామన్వెల్తులో నుండుటకే నెహ్రూ ప్రధాని సుముఖుడైయున్నట్లు తెలియుచున్నది. సభికులలోమాత్రము కొందరికి యీ విషయంలో మతభేదమున్నదట.

ఐర్లండు చర్యపట్ల సభికులలో సానుభూతి యున్నదట. కాని, సైనిక, ఆర్థిక, పారిశ్రామిక రంగములలో ప్రస్తుతమున్న పరిస్థితుల ననుసరించి, కామన్వెల్తుతో సంబంధము కలిగియుండుటయే భారతదేశమునకులాభదాయకమని తలంపబడుచున్నదట.

ప్రస్తుతము తొందరపడి యే నిర్ణయమునూ చేయగూడదనీ, జయపూర్ కాంగ్రెసులో ఈవిషయము చర్చకుతెచ్చి అచ్చట నిర్ణయము జరుగవలయునని సభికులు కొందరు సూచించిరని యూఢిగా తెలియుచున్నది. ఈసమావేశానంతరము పార్టీ కార్యదర్శి చేసిన ప్రకటనలో—'కామన్వెల్తు సంబంధములపై చర్చ జరిగినది' అని మాత్రము ప్రకటింపబడినది.

ఈసమస్యపట్ల నెహ్రూ అభిప్రాయమునకు, కాంగ్రెస్ కార్యవర్గమువారి ఆమోదమున్నదనీ, రాజ్యాంగ నిర్మాణసభలోని కాంగ్రెస్‌పార్టీ సభ్యులుకూడ సానుభూతినే చూపుచున్నారని అభిజ్ఞ వర్గములలో తెలియుచున్నది.

సూత్రరూపమున, శాసన రూపమున, ప్రవేశపెట్టుటకు ఉపయుక్తమగు రీతిని ఒక ప్రణాళికను ముసాయిదా చేసి ప్రధాని నెహ్రూ పార్టీ సమావేశమునకు నివేదింప నున్నాడని తెలియుచున్నది.

నిన్నను ఐర్లండుపై ప్రధాని చేసిన ప్రసంగమును, ప్రధానమైనదిగా యెవ్వరునూ అభిప్రాయపడుటలేదు. అది తక్కిన అధినివేశరాజ్యములు చేసిన ప్రకటనలతో పాటు లాంఛనప్రాయమైనదను చున్నారు. ఐర్లండునూ భారతదేశమునకునూ చాల వ్యత్యాస మున్నదనీ, దాని మార్గమును భారతదేశము అనుకరించు ననుటకు వీలులేదనీ తలంపబడుచున్నది.

జయపూర్ కాంగ్రెస్ జరుగ నున్న ఈ స్వల్ప అవకాశములో, రాజ్యాంగ నిపుణులు ఈ సమస్యపై ఒకనిర్దిష్ట ప్రణాళికను తయారు చేయలేక పోవచ్చునని, ఈ సమస్య అచ్చట చర్చకు రాక పోవచ్చునని కొందరు అభిప్రాయ పడుచున్నారు.

కాని ప్రధాని నెహ్రూ విషయనిర్ణయ సభలో సైనా యీ విషయమును సూచించక మానడని తలంచుచున్నారు.

## నాన్‌కింగ్‌వైపుకి కమ్యూనిస్టుసేనలపురోగమనం.

### సూచౌవద్ద తిరిగి యుద్ధప్రజ్వలన

### చైనా అంతర్యుద్ధం

నాన్‌కింగు, నవంబరు 27: చైనీస్ అధికారులు అమెరికన్ సహాయంకొఱకు ఒకవంక అర్థించుచుండ, మరొకవంక నాన్‌కింగుకు 135 మైళ్లదూరంలో మాత్రమేఉన్న లిన్ప్ని కమ్యూనిస్టు లాక్రమించుకున్నట్లు షాంగ్‌హైనుండి ఒక వార్త వచ్చినది.

వంతెనలు లేకుండా, 2 మైళ్ల వెడల్పు ఉన్న యాంగ్‌ట్సి నదినిదాటి నాన్‌కింగువైపుకు రావలెనని పురోగమించే కమ్యూనిస్టు సేనలను నిరోధించుటకు ప్రభుత్వసేనలు అతికష్టంమీద పోరాడుచున్నారని వార్తలు తెలుపుచున్నవి. నాన్‌కింగు చుట్టూరా సేనలు రక్షణస్థావరము ఏర్పరచుకొనుచున్నవి.

సూచౌవద్ద తిరిగి యుద్ధం ప్రజ్వరిల్లినదని, ప్రభుత్వసేనానులనుండి వచ్చిన వార్తలు తెలుపుచున్నవి. కమ్యూనిస్టులకోసము ఎలుకలబోనువలె నొకవ్యూహమును ప్రభుత్వసేనలు పన్నుచున్నారని ఇక్కడి పరిశీలకు లూహించుచున్నారు.

సుషీకు పడమరగాఉన్న యుద్ధరంగంలో జనరల్ హువ్వాంగ్‌యీ క్రింద ఉన్న ప్రభుత్వసేనలు లొంగిపోయినవని చెప్పుచు, జనరల్ హువ్వాంగ్ యీ కూడా లొంగిపోవలెనని కమ్యూనిస్టులు రేడియోద్వారా నేడు చేసిన ఆదేశం షాంఘైలో వినబడినది. లొంగిపోకపోతే అతని సేనలు ఒకటి రెండు రోజులలో నామరూపాలు లేకుండా ఎగిరిపోవునని వారు బెదిరించుచున్నారు.

### కమ్యూనిస్టులకు అధిక జననష్టం

సూఛౌకొఱకు 3 వారాలనుండ జరిగే ఘోర యుద్ధంలో కమ్యూనిస్టులకు ఒకటిన్నర లక్షల జననష్టం కలిగించితిమనియు చైనాలోని ప్రభుత్వ సేనాపతి జనరల్ చూచింగ్‌చువాన్ నేడు ప్రకటించెను.

సూచౌ యుద్ధరంగం మరి కొలదిరోజుల్లో ప్రళయసదృశమైపోగలదని, సూచౌను దాటి వచ్చుచున్న కమ్యూనిస్టు సేనలు కొన్ని నాన్‌కింగుకు సగందూరంలోవున్న పెంగ్పూ నగరానికి, యాంగ్‌ట్సీనదీలోయలోని పట్టణాలకు ప్రమాదం కలిగించేటట్లున్నవని సూచనలిచ్చి ప్రకటించెను.

నాన్‌కింగ్, నవంబరు 27: చైనా అంతర్యుద్ధములో ప్రభుత్వ సేనలు అపజయము పొందకుండుట అమెరికాకే లాభము కనుక సత్వర సహకారము చేయవలసినదని చైనా పార్లమెంటు అమెరికా కాంగ్రెసుకు విన్నపము చేసెను.

అమెరికా చైనాకు సహాయము చేయవలెననియు జనరల్ క్లేర్ షెనాల్ట్ నాయకత్వముకింద అమెరికను "ఫ్లైగరు" యుద్ధ విమానదళము ప్రభుత్వ సేనలతో కలిసి యుద్ధము చేయవలెననియు పీపింగ్‌లోని ఏడు అధికార సంఘములవారు తీర్మానించిరి.

కాని ప్రభుత్వ సేనలలో కలిగిన నైతిక భ్రష్టత తొలగనిచో అమెరికనులు సహాయపడినను అపజయము తప్పదని భావించబడుచున్నది. ఓడిపోయిన మంచూరియా సైనికులలో మిగిలినవారు నేడు టీన్‌ట్సిన్‌లో ప్రదర్శనములు చేసిరి. వారు తమ దుర్భరస్థితిని గురించి చెప్పుకొనిరి. ఒక సైనికుని శవమును వీధికడ్డముగా పెట్టి, వాడు సరిఅయిన చికిత్సలేక చనిపోయెనని దారిన పోవువారికి చెప్పసాగిరి.

నాన్‌కింగు పరిసరములను కొన్ని ప్రభుత్వ సేనలు యుద్ధమున కాయత్తమొనర్చుచుండగా మరికొన్ని సేనలు యాంగ్‌ట్సీనది దాటి నాన్‌కింగు మీదికి వచ్చుటకు సంరంభించుచున్న కమ్యూనిస్టు సేనల నెదిరించుచున్నవి. నాన్‌కింగుకు 135 మైళ్ళ దూరములో నున్న విన్నీవద్ద ప్రభుత్వ సేనలు తమ బలమును కేంద్రీకరించుచున్నారు. సూచౌ వద్ద తిరిగి యుద్ధము సాగినదనియు, కమ్యూనిస్టుసేనలు చిక్కుకొనుటకు వ్యూహములు పన్నబడుచున్నవనియు ప్రభుత్వ సేనానులు చెప్పిరి.

### ఉత్తర చైనాలో రాకపోక సౌకర్యముల బంద్

టీంట్సిన్, నవంబరు 28: ఉత్తరచైనా రేవుపట్టణం చిన్వాంగ్‌టావోలోనూ, షాన్‌హైక్వాన్ పట్టణముతోనూ రాకపోక సౌకర్యములన్నీ తెగిపోయినవి. షాన్‌హైక్వాన్ చైనా "గ్రేట్‌వాల్"కు తూర్పుదిశనవున్న ప్రధానమైన కనుమప్రాంతము. వీటితో రాకపోక సౌకర్యములు పోయినవనిన, అచ్చటినుండి చైనా ప్రభుత్వవర్గముల ఉపసంహారము సమాప్తమైనదనే భావించవచ్చునని పరిశీలకులు అనుచున్నారు.

టీంట్సీన్‌కు 150 మైళ్లు ఈశాన్యముగనున్న చిన్వాంగ్‌టావో రేడియో సంబంధముకూడ నిన్న ఆగిపోయినది.

షాన్‌హైక్వాన్‌కు దాదాపు 63 మైళ్లు నైరుతిదిశనవున్న లువాన్‌హోనది పడమటిఒడ్డున ప్రభుత్వ సైనికబలముల సమీకరణ జరుగుచున్నది. అంగబలమును, ఆయుధబలమును మిగుల్చుకొనుటకే ప్రభుత్వము చిన్వాంగ్‌టావో, షాన్‌హైక్వాను ప్రాంతములనుండి ఉపసంహారము సాగించి వుంటుందని చైనాపత్రికలు వ్రాయుచున్నవి.

జెహాల్ రాజధాని పతనానంతరం అచ్చటి రాష్ట్రీయప్రభుత్వము హోపే రాష్ట్రములో మారుమూలనవున్న మియువాన్ నుండి పనిచేయుచున్నది. హోపే ప్రభుత్వం పీపింగులో కార్యాలయం స్థాపించినది.

### నూతన ప్రధాని ప్రకటన

షాంఘై, నవంబరు 28: చైనా నూతన ప్రధాని డా॥ సన్‌ఫో తన మంత్రివర్గమును కొద్దిమంది సభ్యులు మాత్రమేవుండి అధ్యక్షుని అనుమతితో నిమిత్తములేకే ఏ ప్రధాన నిర్ణయములనైనను చేయుదుంగురని ప్రకటించుచున్నాడు.

## నెల్లూరుకు విమానాశ్రయం

### సివిల్ వైమానికయాన అభివృద్ధికి 10 సంవత్సరముల ప్రణాళిక

న్యూఢిల్లీ, నవంబరు 27: సివిల్ వైమానిక యానాభివృద్ధికి పది సంవత్సరముల కార్యక్రమ మొకటి తయారు చేసియున్నారు. ఈ ప్రణాళిక ననుసరించి 14 కోట్ల రూపాయల ఖర్చుతో 21 క్రొత్త విమానాశ్రయములను నిర్మించెదరు. దీనిలో మూడు అంతర్జాతీయ విమానాశ్రయములను —అనగా బొంబాయియందలి శాంటాక్రజ్, కలకత్తా యందలి డమ్‌డమ్, ఢిల్లీ యందలి పాలమ్ విమానాశ్రయములను అభివృద్ధి చేయుటకు పెట్టుబడిఖర్చు 5 కోట్ల రూపాయలు చేసియున్నది. ఈ క్రింది ప్రదేశములలో క్రొత్త విమానాశ్రయములను నిర్మించెదరు: అజ్మీరు, మంగళూరు, ఆలీఘరు, బర్‌హాంపూర్, కాలికట్, కడలూరు, డేరాడూన్, హుబ్లీ, నెల్లూరు, ఇందోరు మండలము, రత్నగిరి, సేలం, సాగర్, సూరట్.

పైని పేర్కొనబడిన మూడు అంతర్జాతీయ విమానాశ్రయములు గాక పెద్దవగు అహమ్మదాబాదు, అలహాబాదు, లక్నో, మద్రాసు, నాగపూర్, విశాఖపట్నం, పాట్నా విమానాశ్రయములను అభివృద్ధి చేయుటకు పథకములు తయారైనవి.

దేశ విభజనానంతరము భారత దేశమునందు, భారత దేశములో చేరిన సంస్థానములందును 27 విమానాశ్రయము లుండెను. వీనినిండా విమాన సర్వీసులను క్రమముగా నడుపుచుండెను. 1947 సం॥లో 14 క్రొత్త విమానాశ్రయములలో సిబ్బందిని నియమించి, యంత్రసామగ్రి సమర్చి, విమాన సర్వీసులను నడుపుటకు యోగ్యమైన వానిగా చేసిరి. అసాములోగూడా విమాన సంబంధమైన లేర్పరచిరి. (అ. ప్రె.)

## జార్జిరాజుకు శస్త్రచికిత్స అవసరమా?

### అమెరికాలో వదంతులు: రాజభవనవర్గాల మౌనం

లండన్, నవంబరు 28: జార్జి రాజు పరిస్థితి ప్రమాదకరముగ పరిణమించినదనీ, శస్త్రచికిత్స సంభవమనీ అమెరికాలో ప్రచారమగుచున్న వదంతులనుగురించి బక్కింగ్‌హాం రాజభవన అధికారవర్గములు తమ మామూలు ఆచారము ప్రకారము ఏ విధమైన వ్యాఖ్యానమూ చేయుటలేదు.

## జిన్నా స్థాపించిన లీగ్ పత్రిక 'డాన్' ప్రచురణపై సింధుప్రభుత్వాంక్ష

కరాచీ, నవంబర్ 27: కరాచీనుండి వెలువడు 5 పత్రికలు, సింధురాష్ట్రములో ప్రకటింప బడగూడదని సింధుప్రభుత్వము నేడు ఒక నిషేధాజ్ఞను ప్రకటించినది. ప్రజారక్షణ చట్టము కింద ఇట్టిచర్య తీసుకొనబడినదని ప్రకటింపబడినది. ఈ నిషేధాజ్ఞ నవంబరు 25 తేదీనుండి ఒక ఆరు మాసములవరకూ అములులో నుండును.

### నిషేధింపబడిన పత్రికలు

ఇంగ్లీషులో వెలువడు పత్రికలు 'డాన్' 'సింధ్ అబ్జర్వర్' ఉరదులో వెలువడు పత్రికలు 'జంగ్' 'అంజమ్' సింధీ భాషలో వెలువడు పత్రిక 'సింధ్' నిషేధాజ్ఞకు గురియైన ఈ అయిదునూ దినపత్రికలే.

ఈ పత్రికలపై సింధుప్రభుత్వం నిషేధాజ్ఞను ప్రకటించుటవల్ల యేర్పడిన అసహ్యకరమైన పరిస్థితిని తొలగించుటకు సింధు గవర్నరు వెంటనే జోక్యము కల్గించుకొనవలయునని హెచ్చరించుచూ అఖిల పాకిస్థాన్ ముస్లింలీగు అధ్యక్షుడు, చౌదరి కాలీకుజ్జమాన్ గారుఒక ప్రకటన చేసిరి.

## భారతరాజకీయవ్యవస్థదృష్ట్యా సంస్థానకాంగ్రెస్‌రాజకీయదృక్పథం ఉండాలని శ్రీ గోపాలరెడ్డి సలహా

హైదరాబాద్, నవంబరు 27: హైదరాబాద్ సంస్థానపరిస్థితిని తెలుసుకొనుటకుగాను నేటిఉదయం యిక్కడకువచ్చిన చెన్నరాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు స్వామి రామానందతీర్థ, మాడపాటి రామచంద్రరావు తదితర సంస్థానకాంగ్రెస్ నాయకులను కలుసుకొనిరి. గోపాలరెడ్డిగారు హైదరాబాద్ మిలిటరీ గవర్నరు చౌధరీగారి అతిథిగానుండిరి. తాను నవంబరు మొదటివారంలో కాశ్మీరుకువెళ్ళినాననీ, నిజాంసంస్థాన పరిస్థితులను స్వయంగా తెలుసుకొనవలెనను ఉద్దేశ్యంతోనే హైదరాబాదు వచ్చినాననీ మంత్రిగారు ఒక ఇంటర్వ్యూలో చెప్పిరి.

సంస్థానకాంగ్రెస్ నాయకులు బెజవాడ గోపాలరెడ్డిగారితో సంస్థానంలో తాత్కాలిక ప్రభుత్వ స్థాపన విషయం మొదలుకొని సంస్థాన కాంగ్రెస్ సంఘమునకు సంబంధించిన విషయములవరకు అన్నిరకములైన విషయములను గురించి చర్చించినారని తెలియుచున్నది. సంస్థానంలో ఒక్కసారివచ్చిన బ్రహ్మాండమైన మార్పుప్రజలలో పెద్దపెద్ద ఆశలను కలుగజేసిందనీ, శాంతిభద్రతల పునరుద్ధరణయే ప్రప్రథమంగా నిర్వర్తింపవలసిన కార్యభారమనీ, భూమి సంబంధమైన సంస్కరణలను ప్రవేశపెట్టుటద్వారానే కమ్యూనిస్టు సమస్యను సమూలంగా పరిష్కారం చేయవలసియున్నదనీ, యీ సంస్కరణలను ఒక్క ప్రజాప్రభుత్వమే చేయగలదనీ, ప్రస్తుతం మారిపోయిన పరిస్థితుల కనుగుణంగా సంస్థానకాంగ్రెస్ లక్ష్యములలో కూడ మార్పు రావలసిన అవసరమున్నదనీ సంస్థాన కాంగ్రెస్ నాయకులు గోపాలరెడ్డిగారికి చెప్పినట్లు తెలియుచున్నది.

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడుటకు 2 సం॥ లైనా పట్టవచ్చునని విస్పష్టం చేయుచు, అఖిల భారత రాజకీయ వ్యవస్థ దృష్ట్యా సంస్థాన కాంగ్రెస్ నాయకులు తమ రాజకీయ దృక్పథమును నిర్ణయించుకొనవలెనని, గోపాలరెడ్డిగారు వారికి సలహాయిచ్చినట్లు తెలియుచున్నది. గోపాలరెడ్డిగారు హైదరాబాద్ సైన్యం నుండి తొలగించబడిన సైనికులకు కల్పించబడుచున్న పునరావాసయేర్పాట్లనుపరిశీలించిరి.

# జమీందారీల పరిహారం

## రాజ్యాంగపరిషత్తు చర్చ

గోవిందవల్లభపంతుగారి తీర్మానం

("ఆంధ్ర పత్రిక" విలేఖరి)

డిల్లీ, నవంబరు 25: భారతదేశములోని పౌరుల ఆస్తిహక్కులను భారత ప్రభుత్వము రక్షించవలెనను ధర్మసూత్రమును భవిష్యద్భారత రాజ్యాంగ విధానములోని ప్రాతిపదిక పౌరస్వత్వములందు చేర్చవలెనను విషయమై ఈ వారము రాజ్యాంగ పరిషత్తులో చర్చ ప్రారంభింపబడును. ప్రస్తుతము రాజ్యాంగ విధానము సాయిదాలో ఆ విషయమై యీ క్రిందిరీతిగా నిర్వచింపబడియున్నది.

న్యాయశాసనాధికారము లేకుండా ఏ పౌరుని ఆస్తినైనను ప్రభుత్వము తొలగించరాదు. వ్యాపారసంస్థ యొక్కగాని పరిశ్రమ యొక్కగాని స్థిరాస్తులను ప్రభుత్వమువారు తీసికొనదలచినయెడల అందుకు తగిన నష్టపరిహారము నియ్యవలసినదని నిర్ణయించి, అట్టి నష్టపరిహారమును యేనిధముగా చెల్లించవలెనో అపదశులను ముందుగా నిర్ణయించి శాసించవలెను."

ఇటీవల నష్టపరిహారమును జమీందారులకు చెల్లించు విషయములో ఇండియా ప్రభుత్వ ప్రాజ్ఞ్యయశాస్త్రవేత్తలు ఇండియా అట్టును పరిశీలించి నష్టపరిహారమునకు రొక్కముగా యివ్వబడవలసినదై యున్నదనియు, గవర్నమెంటు పత్రముల రూపంలోగాని, ట్రాన్సుఫరు చేసుకొనుటకు వీలుకాని పత్రముల రూపంలోగాని యివ్వదగినదికాదని అర్థము చెప్పియుండిరి. ఈవిధమైన అన్వయమును గమనించి రాజ్యాంగ విధానపు ముసాయిదాలోని పై వాక్యములను పరిశీలించవలసి యున్నది.

సంయుక్త పరగణాల ప్రధానమంత్రియగు గోవింద వల్లభపంతుగారు పై చెప్పిన రాజ్యాంగముసాయిదా నిర్వచనమునకొక సవరణ తీర్మానమును పరిషత్తులో ప్రతిపాదించుచున్నారు. ట్రాన్సుఫరు చేయ వీలు లేని (పరివర్తనానర్హమైన) పత్రము లరూపేణ పరిహారమునిచ్చుట యుక్తమైన నష్టపరిహారముగా నుండదగునని యీ సవరణ తీర్మానములో కలదు.

కాని, సర్ హోమీమోడీగారు మరొక సవరణ తీర్మానమును ప్రతిపాదించుచు నష్టపరిహారమనునది నగదు రూపంగానే ఉండవలెనని కోరుచున్నారు.

కాంగ్రెసు అధిష్ఠానవర్గమువారిలోనే యీ విషయమైఅభిప్రాయభేదము ఏర్పడినది. ఒకపక్షమువారు గోవిందవల్లభపంతుగారి తీర్మానమును హర్షించుట లేదు. పంతుగారి సవరణ తీర్మానము ఆమోదింపబడినట్లయితే, దేశములోని ఆర్థికాభివృద్ధియును పరిశ్రమాభివృద్ధియును అంతకంతకు వెనుకంజ వేయుగలదని వారి అభిప్రాయము. ఏ పరిశ్రమనైనను ప్రభుత్వమువారు తీసికొనేయెడల అట్టి పరిశ్రమలోని వాటాదారులకు నష్టపరిహారం ప్రభుత్వ ఋణపత్రముల రూపేణ యివ్వబడునుచో యెడల పరిశ్రమలయందు తమ ద్రవ్యమును పెట్టుబడి పెట్టుటకుగాని వాటాలు తీసికొనుటకుగాని ఎవ్వరును యిష్టపడరు. ధనస్వాముల పక్షమువారికి పేదల పక్షమువారికి యీ విషయములో చాలా తీవ్ర వివాదము రాజ్యాంగ పరిషత్తులో జరుగగలదు.

రాజ్యాంగ పరిషత్తులో ధనస్వాముల పక్షమువారు అధిక సంఖ్యాకులుగా లేరు గనుక, గోవిందవల్లభపంతుగారి సవరణ తీర్మానము నెగ్గవచ్చునని సూచనలు కల్పించుచున్నవి.

ఆయా రాష్ట్రములలోని జమీందారీ రద్దు చట్టముల గతియిది యీ సవరణ తీర్మానముపై ఆధారపడియున్నది. క్రొత్త రాజ్యాంగవిధానము ననుసరించి జరుగనున్న రాబోవు ఎన్నికలలో కాంగ్రెసు పార్టీయొక్క భవిష్యత్తు కూడా దీని మీదనే ఆధారపడియుండును. ఈసవరణ తీర్మానము ఆమోదింపబడేయెడల దేశములోని యంత్రాగార పరిశ్రమల పురోభివృద్ధిని కూడా ఇది బాధించగలదు.

## ఎస్టేటు శిస్తు తగ్గింపు నిబంధనలు

మదరాసు ఎస్టేటు లాండు అద్దె శిస్తు తగ్గింపు చట్టం ప్రకారం, ప్రభుత్వంవారు తయారు చేసిన నిబంధనలలో గజిటులో శిస్తు తగ్గించ బడినట్లు ప్రకటించిన తరువాత రెండు నెలలలోగా భూస్వాములు జిల్లా కలెక్టరుకు కొన్ని వివరాలు విధిగా తెలుపాలని నిర్ణయంగలదు. రెండు నెలల గడువు చాలదని పలువురు భూస్వాములు తెలుపుకొన్నందున, దరఖాస్తుపై జిల్లాకలెక్టరులు ఎక్కువ గడువు యివ్వవచ్చునని నిబంధన మార్చబడెను.

### బియ్యం మరలు

మదరాసు బియ్యం మరల పైనున్న నిర్బంధం యీ దిగువ జిల్లాలలో నవంబరు 20 నుండి వర్తించునని ప్రభుత్వం వారు ప్రకటించిరి: అనంతపూరు, కడప, కర్నూలు, నెల్లూరు, విశాఖపట్నం, ఈ. ఆర్కాటు, చెంగల్పట్టు, మరికొన్ని అదవజిల్లాలు.

# కార్మిక నాయకుల సమావేశం

## ప్రభుత్వ విధానంపై యస్. యం. జోషీవిమర్శ

బొంబాయి, నవంబరు 27: సోషలిస్టు పార్టీవారి ఆధ్వర్యమున ఇచట కార్మిక నాయకుల సమావేశము నేటి సాయంకాలము ఆరంభమైనది. ఈ సమావేశము రెండురోజులు జరుగును. దీనికి కమ్యూనిస్టు నాయకులుగాని, నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకులుగాని ఆహ్వానితులు కాలేదు. సోషలిస్టుపార్టీ, ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ మొదలగు సంస్థలకు చెంది, ఇటీవల అ. భా. ట్రే. యూ. కాంగ్రెసునుండి బయటికి వచ్చియున్న నాయకులు ఆహ్వానించబడిరి. రుయికర్, ఖేడ్గికర్, మణిబెన్ కారా, కార్నిక్, గోరే, అశోకమెహతా, పీటర్ అల్వారిస్, శిబనాథ్ బానర్జీ, సురుస్వామి, ఆంథోనీపిళ్లే మొదలగువారు వచ్చిరి.

ఆహ్వానములు పంపిన జయప్రకాశ నారాయణ కార్మికనాయకులకు స్వాగతమిచ్చుచు, ఈ సమావేశము శ్రామికుల జీవనభృతిలో తరుగుదలను గురించి చర్చించుటకు అనధికారరీత్యా ఏర్పాటయినదనియు, దేశక్షేమమునకు నేడు పెట్టుబడిదారుల క్షేమము అననుకూలముగానూ, శ్రామికుల క్షేమము అనుకూలముగానూ ఉన్నదనియు, శ్రామికుల సేవద్వారా దేశసేవ చేయుటకు తాము పాటు పడుచున్నామనియు, కార్మికుల స్థానికచర్యలకన్న దేశమంతటా కార్మికశక్తుల సమీకరణ జరిగి విస్తృత చర్యలు జరిగినచో తీవ్రసంఘర్షణ లేకయే ఫలితములు కలుగుననియు, అట్టి సమీకరణ ఎట్లు సాధ్యమగునో విచారించవలసి యున్నదనియు చెప్పెను.

సమావేశమునకు ఎస్. ఎమ్. జోషి అధ్యక్షుడుగా ఎన్నుకోబడెను. ఆయన ఇట్లు చెప్పెను:

సమ్మె అనునది ధర్మమైన సత్యాగ్రహము. దానిని నిషేధించిన మాత్రమున ఉత్పత్తి పెరుగదు. ఉత్పత్తి పెరుగుటకు కార్మికులు మనఃస్ఫూర్తిగా సహకరించవలెను. వేతనముతో కూడిన శెలవులివ్వ నిరాకరించియు, అక్రమసమ్మె జరిపెనని కార్మికసంఘమును రిజిష్టరు చేయక యుండుట చేయుచు పనివారిచేత బలాత్కారముగా పనిచేయింపజూచుట అన్యాయమే కాక స్వార్థముకూడానూ. సమ్మెలు నిషేధించి, వివాదపరిష్కారమునకు రాజీ ఏర్పాట్లు కట్టుదిట్టము చేసినచో ఉత్పత్తి నిర్విఘ్నముగా సాగునని ప్రభుత్వ మనుకొనుచున్నది. నీటిసప్లయి, విద్యుత్ సప్లయి, రోగ్యచికిత్సలవంటి ముఖ్యశాఖలు తప్పించి మిగిలిన విషయములలో ప్రభుత్వము వారు చేయు రాజీ ఏర్పాట్లు నిర్బంధకములుగా ఉండరాదు. రాజీ సంఘముల వారు తప్పెవరిదో సూచించిన తర్వాత ప్రజాభిప్రాయము ప్రోద్బలముతో ఉభయపక్షములను రాజీకివచ్చుటవలన హెచ్చు లాభము కలదు. కిందటియేడు ఢిల్లీ సమావేశములో జరిగిన పారిశ్రామిక శాంతి తీర్మానమును ప్రభుత్వ ప్రతినిధులును, పత్రికలవారును దుర్వినియోగపరచుచున్నారు. అందులోని నిబంధనలు తృప్తికరముగా లేకపోవుట అటుండ, ఆతీర్మానమువలన ప్రభుత్వము తనమీదనున్న బాధ్యతను నిర్వర్తించవలసినదను పారిశ్రామిక శాంతి భారమును శ్రామికులపై వేయరాదు. దేశములోని ఆర్థిక చిక్కులను పరిష్కరించుటకు నిర్దిష్ట ఉత్పత్తి విధానముండవలెను. అట్టి విధానము మన ప్రధానికి ఇష్టమైనను ప్రభుత్వమువారు చేయుప్రయత్నములు నిరుపయోగముగనున్నవి.

# ఆసియా ప్రాంతీయ కార్మికసంఘం

చెన్నపట్నం, నవంబరు 27: చెన్నరాష్ట్ర పరిశ్రమ శాఖా మంత్రి శ్రీ సీతారామరెడ్డి ఆసియా ప్రాంత కార్మిక మహాసభ సమాలోచన సంఘసభ్యులకు స్వాగతమిచ్చుచూ, మహాసభవారి నివేదికలో సూచింపబడిన కొన్ని కార్యక్రమములను చెన్నరాష్ట్ర ప్రభుత్వము అమలు జరుపుటకు ప్రారంభించినదనిరి. సహకార మహాసంఘములను స్థాపింపవలెనని సూచింపబడినది. రాష్ట్ర సహకారశాఖా మంత్రి అధ్యక్షత క్రింద, అట్టి కొన్నిట స్థాపింపబడినది. ఆ సంఘములో సహకారోద్యమమునం దారితేరిన నిపుణులున్నారు. సహకార సౌకర్యములను రాష్ట్రమంతటనూ నెలకొల్పుట, కనుసునుగా నొక బిల్లు తయారగు చున్నది. రాష్ట్రములో చెన్నరాష్ట్ర సహకారబ్యాంకు, సహకార కేంద్రభూమితనఖాబ్యాంకు(రాష్ట్ర) చేనేత పారిశ్రామికుల సహకారసంఘము, రాష్ట్రమార్కెటింగ్ సంఘము, రాష్ట్ర సహకారసంఘము మొదలైన అనేకసంస్థలు కలవు. ప్రాథమిక సహకార సంఘములను, జిల్లా స్టోర్సును, ధనసహాయము చేయుటకు సెంట్రల్ బ్యాంకులకు తెలుపబడినది. చిన్న మార్కెటింగు సంఘములకు, సహకార స్టోర్సుకు, మార్కెటింగు ఫెడరేషన్ సహాయము చేయును. వ్యవసాయ, పారిశ్రామిక సహకార సంఘములు లెక్కకు మిక్కిలియున్నవి. అందులో చేనేతవారి సంఘాలు చెప్పుకోతగ్గవి. 1946 జూను నరికి వీటిసంఖ్య 886. 1948 జూను నరికి 893 వరకు పెరిగింది. అవి రూ. 66½ లక్షల విలువగల సరకు తయారు చేయుచున్నవి.

స్త్రీల గృహపరిశ్రమ సహకార సంఘాలు పలుచోట్ల స్థాపించబడినవి. తివాచీలు, కంబళ్లు, పేముసరకు, బుట్టలు, తోలుపనులు, లోహపుపనులు చేయు సహకారసంఘము లెన్నో యేర్పడినవి. రాష్ట్రమంతట గృహపరిశ్రమలు వ్యాపింపచేయుటకు 100 సహకారసంఘాలు స్థాపించుటకు ప్రభుత్వంవారొక స్కీము ఆలోచిస్తున్నారు.

సహకారోద్యమము పాఠశాలలు కళాశాలలకుగూడ వ్యాపించింది. విద్యాసంస్థలందు 273 సహకారసంఘములు 23,000 సభ్యులతో గలవు. కనుక జయప్రదముగా రనుతుంటున్న కార్యాలెన్నో అపుడే యీ రాష్ట్రమున అమలు జరుగుచున్నవని తెలుసుకోవచ్చును. ఈ ఉద్యమాన్ని యింకా వ్యాపింప చేయుటకు అంతర్జాతీయ కార్మిక కార్యాలయమువారు ఏమి సూచింతురో యని వేచియున్నాము. ఈ సంస్థకు ఇండియాలోనున్న ప్రభుత్వాలన్నీ తోడ్పడెలవు." అని మంత్రి సీతారామ రెడ్డిగారు తెలిపిరి.

# నిజాం సమస్యను వదలివేయాల్సిందని భద్రతా మండలికి విజ్ఞప్తి

## జఫ్రుల్లాఖాన్‌వాదము అసత్య పూరితమని కాంగ్రెస్‌అధ్యక్షుడు రామానందతీర్థ ప్రకటన

హైదరాబాద్, నవంబరు 27: సంస్థాన కాంగ్రెసు అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు నేడొక ప్రకటన చేయుచు హైద్రాబాద్ సమస్యను గురించి యిక ముందు ఏ విధమైన చర్చ జరుపకుండా శాశ్వతంగా వదలివేయవలసిందని భద్రతా మండలికి విజ్ఞప్తి చేసిరి.

రామానందతీర్థగారి ప్రకటన యిట్లున్నది.

"హైదరాబాద్ ఫిర్యాదును భద్రతా మండలి నుండి నిజాం నవాబు ఉపసంహరించుకొన్నప్పుడు, సంస్థాన భవిష్యత్తు ప్రజలవలననే నిర్ణయింపబడునని ప్రజలు తమ నాయకులద్వారా స్పష్టంచేసినప్పుడు, తిరిగి యీ విషయంపై చర్చ జరుపవలసిందిగా భద్రతామండలికి 'దుస్సలహా' ఒసంగబడినది. ఈ చర్చను వాయిదా వెయ్యకుండా మండలి యీ విషయమును ఎజెండానుండి తొలగించి యుండవలసినది.

పాకిస్తాన్ తన కుత్సితలక్ష్యములను సాధించుకొనుటకుగాను ప్రతి అవకాశమును ఉపయోగించుకొనుచున్నదన్న విషయం అందరకు తెలిసినదే. చచ్చిపోయిన శవమునకు తిరిగి ప్రాణప్రతిష్ఠ చేయవలెనని అది ప్రయత్నించుచున్నది. సర్ జఫ్రుల్లాఖాన్‌వాదము పూర్తిగా అబద్ధములతోనిండియున్నది. సంస్థానంలో శాంతిభద్రతలు సంపూర్ణంగా పునరుద్ధరింపబడుట జరిగినదని చెప్పవచ్చును. మిలిటరీ గవర్నరు అతి చాకచక్యంతో, వర్తించి పరిస్థితిని అదుపులోనికి తీసుకొనివచ్చెను. కొంతమంది సంఘ విద్రోహులవలన అక్కడక్కడ జరుగుచున్న సంఘటనలు మినహాగా సంస్థాన పరిస్థితి ప్రశాంతంగా నున్నది. భద్రతామండలీ సభ్యులు హైదరాబాద్ విషయమునుగురించి యింకా తరచకుండా ఉండట ప్రస్తుత పరిస్థితులలో యుక్తంగా నుండగలదు. అంతర్జాతీయ రాజకీయకుతంత్రాలలోకి దీనిని కూడ యిరికించవద్దని వారిని కోరుచున్నాను.

ప్రపంచశాంతికి, సభ్యతకు ఐక్యరాజ్యసమితి చిహ్నముగా నుండవలసి యున్నది. దీనిద్వారా విశ్వమానవ సౌభ్రాతృత్వము నెలకొల్ప బడగలదని భారతదేశ ప్రజలు ఆశించుచున్నారు. కొంతమంది స్వార్థపరత్వమువలన యీ ఆశలను నిరాశలుగా చేయవద్దని కోరుచున్నాను.

హైదరాబాద్‌పై జరుగు చర్చలలో ఇండియా పాల్గొన నిరాకరించుట యుక్తముగా నున్నది. ఇండియా భవిష్యత్తే తమ భవిష్యత్తని హైదరాబాద్ ప్రజలు నిర్ణయించుకొన్నారు. దీన్నిగురించి లాంఛనంగా త్వరలో ఏర్పడనున్న రాజ్యాంగ పరిషత్తు ద్వారా నిర్ణయంచేయబడును. రాజ్యాంగ పరిషత్తే హైదరాబాద్ భవితవ్యమును నిర్ణయించగలదు. తమ భవిష్యత్తును తామే రూపురేఖలు దిద్దుకొనవలెనని హైదరాబాద్ ప్రజలు నిర్ణయించుకొన్నారు. మా వ్యవహారాలలో భారతదేశ బయటిశక్తు లేవీ జోక్యం కలిగించుకోవద్దని కోరుచున్నాను. మేము భారతదేశ పౌరులము. మేము ఎల్లప్పుడూ అవిభంగానే ఉండెదము."

### కాంగ్రెస్ ఆశయ ప్రచారం

మౌలానా అబుల్‌కలాం అజాద్ అధ్యక్షతను యిటీవల ఏర్పడిన కేంద్ర అభ్యుదయ సంఘసభ్యుడు మఖ్బూల్ అహమ్మద్ నేడు హైదరాబాద్ వచ్చెను. ఆయన యిక్కడ ఒకవారం రోజులపాటు ఉండును. హైదరాబాద్ ముస్లింలలో కాంగ్రెస్ ఆశయములను గురించి, మత సామరస్యమునుగురించి ప్రచారం చేయుట ఆయన రాకలోగల ఉద్దేశ్యము. ఆయన యిక్కడ ఉండగా సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుని, ముస్లిం నాయకులను కలుసుకొనును.ఆయన యిప్పటికప్పుడే ఆంధ్ర, తమిళ్నాడు, మలబారులలో పర్యటించెను. మఖ్బూల్ అహమ్మద్ హైదరాబాద్‌లో ఒక జాతీయ ఉర్దూ దినపత్రికను ప్రారంభించునని తెలియుచున్నది.

# నిజాంలో మిలిటరీ ప్రభుత్వ కాలపరిమితి

## శాంతి భద్రతలు పూర్తిగా ఏర్పడువరకు ఉండునని చౌదరీ వివరణ

హైదరాబాద్, నవంబరు 27: "సంస్థానంలో మిలిటరీప్రభుత్వం పనిచేయు కాలపరిమితి అనిశ్చితము. శాంతి భద్రతలు సంపూర్ణంగా పునరుద్ధరింపబడువరకు మిలిటరీ ప్రభుత్వం కొనసాగగలదు." అని హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరీగారు తమ గౌరవార్థం హైదరాబాద్, సికిందరాబాద్‌లలోని వైద్యులు, వైద్యవిద్యార్థులు కలసి ఏర్పాటుచేసిన విందులో ఇండియా మెడికల్ అసోసియేషన్ హైదరాబాద్ శాఖ అధ్యక్షుడు డా॥ జి. ఎస్. మేల్కోటే గారు సమర్పించిన స్వాగత పత్రమునకు సమాధానముగా చెప్పిరి. తనకు చిన్నప్పుడు డాక్టరు కావలెననే కోరిక ఉండెడిదనీ, వైద్యవృత్తి అనిన తనకు ఎక్కువ అభిమానమనీ చెప్పుచూ సంస్థానంలో ప్లేగువ్యాధి బయటుదేరినప్పుడు వ్యాధినివారణ విషయంలో వైద్యులు చూపించిన సహకారమునకు చౌధరీగారు కృతజ్ఞత తెలియజేసిరి. సంస్థానంలో శాంతి భద్రతలను పునరుద్ధరించుటే మిలిటరీ ప్రభుత్వకార్యమని, ఈ ప్రభుత్వమునకు మత విషయాలతో సంబంధం లేదనీ, పక్షపాతం లేదనీ వారుచెప్పిరి. ప్రథమంలో మేల్కోట్ గారు మిలిటరీ గవర్నరునకు స్వాగతమిచ్చుచు సంస్థానపరిస్థితులను చక్కబరచుటలో మిలిటరీ ప్రభుత్వంతో వైద్యులు సంపూర్ణంగా సహకరించగలరని చెప్పిరి.

# బెర్లిన్ ప్రతిష్టంభన

## బ్రాముగ్లియా కృషిఫలించే అవకాశములేనట్లే

లండన్, నవంబరు 27: బెర్లిన్ ప్రతిష్టంభనా పరిష్కారమునకు భద్రతామండలి అధ్యక్షుడు డా॥ జాన్ బ్రాముగ్లియా ఆఖరు ప్రయత్నములు చేయుచున్నాడు. ఈలోపుగా తూర్పు బెర్లిన్‌లో ప్రత్యేక పరిపాలకవర్గస్థాపనకు రష్యనులు తమ ప్రయత్నములను తాము సాగించుచున్నారు. భద్రతామండలి అధ్యక్షుడుగ డా॥ బ్రాముగ్లియా ఇక మూడురోజులు మాత్రమే పనిచేస్తాడు. తూర్పు, పశ్చిమ, అగ్రరాజ్యప్రతినిధులతో ఇతడు బెర్లిన్ ప్రతిష్టంభనపై నేడు చర్చలు జరిపెను. ఈ చర్చల పర్యవసానము విషయమై పారిస్‌లోని అధికారవర్గములు నిరాశాభావమునే చూపుచున్నవి. ఒప్పందము కుదురు అవకాశములన్నియు సన్నగిలిన వనే వీరి ఉద్దేశ్యము.

బెర్లిన్‌లోని సోవియెట్ మిలిటరీ ప్రభుత్వమునకు సన్నిహితులైనవారు, రష్యన్ మిలిటరీ గవర్నర్ మార్షల్ సొకలొవ్‌స్కీ సోవియెట్ బెర్లిన్ భాగమున ప్రత్యేక నగరపాలకవర్గమును, సిటీ అసెంబ్లీని ఏర్పరచుటకు ఒక పథకమును ఆమోదించినట్లు తెలుపుచున్నారు. వచ్చే వారాంతమున (డిసెంబరు 5న) మునిసిపల్ ఎన్నికలు జరుగకపూర్వమే సొకలొవ్‌స్కీ ఈ ఏర్పాట్లు చేయుచున్నాడు.

### తూర్పు జర్మనీ ఆర్థిక సంఘ పునర్నిర్మాణము

బెర్లిన్, నవంబరు 27: సోవియెట్ ఆక్రమిత జర్మనీ మిలిటరీ గవర్నర్ మార్షల్ సొకొలొవ్‌స్కీ జర్మనీ ఆర్థిక సంఘమును పునర్నిర్మాణము చేయుట అవసరమని ఉత్తర్వుచేసెను. సోవియెట్ ఆక్రమిత ప్రాంతమునకు చెందిన వివిధ రాజకీయ పక్షముల ప్రతినిధులు రాష్ట్రప్రభుత్వ ప్రతినిధులు చేర ఈ సంఘమున ఇకమీదట 36కు బదులు 101 మంది సభ్యులుపుంటారు.

# ఇండియా-పాకిస్తాన్ సరిహద్దున సంఘర్షణ

## గ్రామస్థులపై పాకిస్తానీల కాల్పులు

అమృతసరము, నవంబరు 26: అమృతసర సరిహద్దున దాల్ అను గ్రామము దగ్గర భారత పోలీసులును పాకిస్థానీలును ఒండొరులపై తుపాకులు కాల్చుకొనుటవల్ల బలూచీ పటాలమునకు (పాకిస్తాన్ పటాలము) చెందిన యిద్దరు సైనికులు మరణించిరని తెలియుచున్నది.

రెండువందలమంది పాకిస్థానీలు తమ సైనికుల సహాయముతో పొలములలో దున్నుకొనుచున్న దాల్ గ్రామస్థులపై తుపాకులు కాల్చిరని చెప్పుచున్నారు. సరిహద్దున నున్న భారత పోలీసులు వారి నెదుర్కొని నిర్జితులైరి. మరియొక భారత పోలీసు పటాల మక్కడికి వచ్చి దుండగీండ్రపై తుపాకులు కాల్చిరి. ఉభయపక్షములవారికి వీడు గంటలసేపు పోరాటము జరిగెను. దుండగీండ్రు హతులైన తమ యిద్దరు సైనికులతో పాకిస్థాన్‌లోనికి పారిపోయిరి. (అ. ప్రె.)

# భారత పాకిస్తాన్ ప్రభుత్వముల రక్షణశాఖా సమావేశం

కరాచీ, నవంబరు 27: భారత పాకిస్థాన్ ప్రభుత్వముల రక్షణశాఖా కార్యదర్శుల, 7వ సమావేశము, ఇచ్చట నిన్న ఉదయం ప్రారంభమై, నేటి సాయంత్రము ముగిసినది. డిశంబరు 6వ తేదీన, ఇట్టి సమావేశమే మరియొకటి ఢిల్లీలోకూడ జరుగగలదు. భారతదేశము తరఫున ఈ సమావేశమునందు పాల్గొన్న ప్రతినిధులు: రక్షణశాఖా కార్యదర్శి హెచ్. యం. పటేల్, సర్వసేనాని జనరల్ సర్. రాయ్‌బుచర్, అడ్మిరల్ పారీ, సైనిక ఆర్థిక సలహాదారు కె. భవానీశంకర్ రావు, బ్రిగేడియర్ కె. బహదూర్ సింగ్ జీ గారలు.

పాకిస్తాన్ ప్రతినిధులు :-రక్షణ కార్యదర్శి లెఫ్టినెంటు కల్నల్ ఇస్కందర్ మీర్జా, సర్వసేనాని జనరల్ సర్ డగ్లస్ గ్రేసీ, లెఫ్టినెంట్ జనరల్ మెక్కే, జె. డబ్లియూ ఆఫోర్డు, ఎయిర్‌వైస్ మార్షల్ పెరికిన్, సైనిక ఆర్థిక సలహాదారు గులామ్ అబ్బాస్‌గారు.

### అసుతోష్ లాహిరీ హెచ్చరిక

న్యూఢిల్లీ, నవంబరు 27: తూర్పు బెంగాలునుండి భారత అధినివేశమునకు వచ్చు హిందువులకు తగిన సౌకర్యములు కలిగించుట అవసరమని అఖిల భారత హిందూ మహాసభ ప్రధాన కార్యదర్శి అసుతోష్ లాహిరీగారు ఒకప్రకటన చేయుచున్నారు. ఇండియన్ యూనియన్‌లో వీరికి తాత్కాలిక సహాయమునే గాక, స్థిర పునరావాస సౌకర్యములు ఏర్పరచు బాధ్యత ప్రభుత్వముదే ననీ కూడా ఇతడు హెచ్చరించుచున్నాడు.

# రష్యాలో గొప్ప భూగర్భ విమానాశ్రయం

ఒసాకా, నవంబరు 27: ప్రపంచంలోకల్లా గొప్పదైన భూగర్భ విమానాశ్రయ నిర్మాణాన్ని సోవియట్ అధికారులు సైబీరియాలో పూర్తి చేశారు. ఈవిమానాశ్రయములో 2400 యుద్ధవిమానా లుండగలవు. ఇది అణ్వస్త్రంచే కూడా భగ్నం కాదని సోవియట్ ఇంజనీర్లు విశ్వసిస్తున్నారు.

ఇది ఇమాన్ రైల్వే జంక్షన్‌వద్ద వ్లాడివోస్టాక్‌కు ఉత్తరంగా రెండువందల మైళ్ళ దూరంలో వున్నది. వేయివేల మంది జపాన్, జర్మన్ యుద్ధఖైదీలు మూడు సంవత్సరాలు పనిచేసి, 80 రైల్వే సొరంగాలను త్రవ్వారు.

ఈ విమానాశ్రయంలో కొన్ని భాగాలు బాంబర్లకు, మరికొన్ని ఫైటర్లకు అనుకూలంగా ఉండేట్లు నిర్మించారు. ప్రతి భాగానికి రైల్వేమార్గ మున్నది. ఒక్కొక్క భాగంలో 80 విమానా లుండగలవు.

ఈ విమానాశ్రయం చుట్టూ జీపులో ప్రయాణం చేయుటానికి ఎనిమిది గంటలు పడుతుంది. —గ్లోబ్.

### కాంగ్రెస్ మహాసభకు రాజెన్‌బాబు వెళ్లరట

వర్ధా, నవంబరు 28: రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారు జయపూర్ కాంగ్రెసు మహాసభకు హాజరుకారనీ, ఢిల్లీలో నేవుండి రాజ్యాంగ ముసాయిదాకు సంబంధించిన వ్యవహారములు చూసెదరని తెలియుచున్నది వీరి ఆరోగ్యము ఇప్పుడు కొంతవరకు బాగుపడినది పూర్తి స్వస్థత చేకూరగనే ఢిల్లీ వెళ్లెదరు. యం. ప్రె.

# ప్రధానివద్దకు రాయలసీమ రాయబారం

## తమ జిల్లాలలో ధాన్య సేకరణ కూడదని విజ్ఞప్తి

మదరాసు, నవంబరు 27: రాయలసీమ మహాజనసభ తరఫున ఉపాధ్యక్షుడు శ్రీ కే. వి. వేమారెడ్డిగారి నాయకత్వమున ఒక రాయబారము మదరాసు ప్రధాని శ్రీ ఓ. పి. రామస్వామి రెడ్డిగారిని ఈ దినం దర్శించి బళ్ళారి, అనంతపూరు, కడప, కర్నూలు, చిత్తూరు మున్నగు ఐదు రాయలసీమ జిల్లాల్లో ధాన్యసేకరణ తిరిగి ప్రవేశపెట్టకూడదని విన్నవించిరి. రాయలసీమ జిల్లాలు ధాన్యముపంటల విషయమున లోటుజిల్లాలుకావడంచేతను వానలుపడక పంటలు పండకపోవుటవల్లను యీప్రాంతాలలో ధాన్యసేకరణను అమలుపరచినట్లయితే ఉత్పత్తిదార్లు ప్రజలు చాలా బాధపడవలసివచ్చునని వారు తెలుపుకొనిరి. రాయలసీమజిల్లాలలో తరుచూ క్షామ పరిస్థితులు కలుగుచున్నందున ఇరిగేషను సదుపాయాల అభివృద్ధికిగాను మదరాసు ప్రభుత్వం తలపెట్టియున్న 8 యేండ్ల ప్రణాళికలో రాయలసీమకు నీటిపారుదల సౌకర్యాలు ఏర్పరచవలెననియు వ్యవసాయమునకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయవలెనని, రాయలసీమ ఖనిజసంపదను పరిశీలనచేసి ఆ జిల్లాలను ఆర్థికముగ అభివృద్ధిపరచవలెనని కోరిరి. రాయబారము గావించిన విన్నపములను సానుభూతితో ఆలోచించెదమని ప్రధానివాగ్దానము చేసెనని తెలుస్తున్నది.

# కౌన్సిలు గౌరవము

## అధ్యక్షులు రామకృష్ణ రాజుగారి సూచన

మదరాసు, నవంబరు 28: మదరాసు కౌన్సిలులో నిన్న కార్యక్రమం ముగిసినానక అధ్యక్షులు సభను కాలనిర్ణయం లేక వాయిదా వేసేముందు, సభా గౌరవం గూర్చి క్లుప్తంగా ఉపన్యసించిరి. జమీందారీ బిల్లు ఉపయుక్తమయినదని దాన్ని జయప్రదంగా కొనసాగించిన రెవెన్యూ మంత్రిగారిని అభినందించిరి.

"శాసనసభలు రెండును (అసెంబ్లీ కౌన్సిలు) ఒకేప్రభుత్వానికి చెందిన రెండు అంగముల వంటివి. అందొకటి ఘనమయింది రెండోది తక్కువయింది అనేభావం కలిగే చర్యలేమి చేయరాదు. ఏ సభయొక్క గౌరవానికి గాని భంగం కలిగించేట్లు ఎవ్వరు ప్రవర్తించరాదు. నే నెపుడు అసెంబ్లీని మరో శాసనసభ అంటున్నానే గాని, దిగువసభ అనడంలేదు. జమీందారీ బిల్లు చర్చించినపుడు, చట్ట నిబంధనలు అసెంబ్లీలో ఆమోదింపబడును అను సవరణపై చర్చలో యీసభయందుండే సామరస్యభావం చెడిపోవుట దురదృష్టము. చట్ట నిబంధనలు రెండు సభల ఆమోదం పొందినపిమ్మట అమలుజరుగునవే మొదటి చట్టంలో గలదు. సెలక్టుకమిటీవారు ఆ క్లాజును సవరించి అసెంబ్లీమాత్రము ఆమోదించాలనిరి. అది ఆసభలో చర్చనున్నపుడే తిరిగి మంత్రిగారు రెండు సభలకు అధికారం యిస్తూ సవరించవలసింది. కాని ఎవ్వరు గమనించకుండా సెలక్టుకమిటీ సూచన అంగీకరించబడింది. ఆసభలో అట్లు జరుగుటవల్ల, యీ సభవారు తమ గౌరవానికి భంగంగా తామే తీర్మానించవలసి వచ్చెను. అట్లా జరుగవలసింది కాదు. రెవెన్యూమంత్రిగారికే యీమార్పు యిష్టం లేకుండెను. వేరొక బిల్లుపెట్టి యీలోటు సవరింతునని మంత్రిగారు అర్థము యిచ్చినపుడు ప్రతికూలపక్షంవారు సంతృప్తి చెందవలసింది. ప్రభుత్వంవారికి ఎంత అధికసంఖ్యాబలంవున్నా, ప్రతికూలపక్షంవారి సహకారంకూడ పొందవలసింది."

అని అధ్యక్షులు చెప్పి, యీ సమావేశమునందు జమీందారీ బిల్లేకాక, గ్రంథాలయముల బిల్లు, అలియసంతానం బిలుకూడా ముఖ్యమయిన చట్టములు గావింపబడినవని వాటి ప్రాముఖ్యతను గూర్చి తెలిపిరి.

డా॥ వి. కె. జాను గారు, ప్రతికూల పక్ష నాయకుడు, అధ్యక్షుని అభిప్రాయముతో ఏకీభవించుచు, యీ సభా గౌరవమునకు భంగకరమగు చర్యలకు తమపక్షం వారు సహించరనియు, జరిగింది మరచిపోయి ప్రభుత్వానికి ప్రతికూలపక్షానికి అన్యోన్యసామరస్యభావం ఇదివరకున్నట్లే యికముందుకూడ ఉండగలదనియు చెప్పిరి. జమీందారీ రద్దుబిల్లు గావించి నందుకు రివెన్యూ మంత్రి కళా వెంకట్రావు గారిని అభినందించుచు వారు "యీ ప్రభుత్వానికే గాక ఏ ప్రభుత్వానికైనా భూషణము వంటివారు. న్యాయశాస్త్రం తెలియకున్నా న్యాయశాస్త్రజ్ఞునివలె చట్టాన్ని నడిపించిరి" అని మంత్రిగారి కరస్పర్శ గావించిరి.

### కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, నవంబరు 27: కృష్ణానది నీటిమట్టం నేడు ఆనకట్టపై 6.20 అడుగులున్నది.

# తరుగు ప్రాంతాలకు ధాన్యం కేటాయింపు

## ఆహారసభలో కార్యదర్శి ప్రకటన

కలకత్తా, నవంబరు 27: కేంద్రప్రభుత్వ ఆహారశాఖ 1949 జనవరి మాసమునకు తరుగు ప్రాంతముల వినియోగమునకై 8 లక్షల 81 వేల టన్నుల ఆహారధాన్యమును కేటాయించినట్లు ఆర్. ఎల్. గుప్తగారు నేటి ఆహారశాఖోద్యోగుల సమావేశములో ప్రకటించెను. (గుప్తగారు కేంద్ర ఆహారశాఖ కార్యదర్శి) ఇందులో గోధుమలు 2 లక్షల టన్నులనీ, బియ్యము 79 వేల టన్నులనీ మిగతా ఇతర ధాన్యములనీ కూడా తెలిపెను. కలకత్తాలో నిన్న ప్రారంభమైన సమావేశము నేటితో సమాప్తమైనది.

### ఇండొనీసియా సమస్య

బటేవియా, నవంబరు 27: పశ్చిమాత్య రాయబారవర్గము నేడు ఇండొనీసియా రాజధాని జోగ్జకర్తా చేరినది. ఇండొనీసియాలో తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వస్థాపన విషయమై ఏకీభావ సాధనకు తాము వచ్చినట్లు రాయబార వర్గనాయకుడు డా॥ స్టిక్కర్ తెలుపుచున్నాడు.

### టోజో ఉరిసమయమున విలేఖరులను రానివ్వరు

టోకియో, నవంబరు 27: జపాను మాజీ ప్రధాని జనరల్ టోజో, ఇంకా ఆరుగురు యుద్ధాపరాధులనూ ఉరితీయునప్పుడు తమను హాజరుకానివ్వవలసినదని పత్రికా ప్రతినిధులు చేసిన దరఖాస్తులను జనరల్ మెక్‌ఆర్థర్ నిరాకరించెను. వీరిని రహస్యముగ ఉరితీయుటకు కారణము లేమిటని ప్రశ్నించగా ప్రభుత్వ ప్రచారశాఖోద్యోగి సమాధానాలు చెప్ప నిరాకరించెను.

టోజోను మిగిలినవారిని ఇక కొన్ని రోజులలోనే ఉరితీసెదరని ఇచ్చట విశ్వసనీయ వర్గాల ద్వారా తెలియుచున్నది.

### రాష్ట్రీయకాంగ్రెస్‌నాయకుల ప్రధాన మంత్రుల సమావేశం

న్యూఢిల్లీ, నవంబరు 27: రాష్ట్రీయ కాంగ్రెసు అధ్యక్షులు, కార్యదర్శులు, రాష్ట్రాల, సంస్థానాల ప్రధాన మంత్రుల సమావేశాన్ని జనవరి మొదటివారంలో జరిపే విషయం న్యూఢిల్లీలో పరిశీలించబడుతున్నది.

రాష్ట్రాలలోని కాంగ్రెసు సంస్థకు, మంత్రివర్గాలకు సహకారం కలిగించే విధానాల నేర్పరచడమే ఈసమావేశ లక్ష్యం.

రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాల కార్యనిర్వాహకవర్గాలకు, మంత్రివర్గాలకు సహకారం మేమాత్రమూ లేదని ఇదివరలో అఖిలభారత కాంగ్రెసు సమితికి ఎన్నో ఫిర్యాదులు వచ్చినవి. గ్లోబ్

# మదరాసుగుఱ్ఱపుపందెముల ఫలితములు

చెన్నపట్నం, నవంబరు 28: మదరాసు గుఱ్ఱపుపందెములలో నిన్న రెండవ రోజున హంటర్లు అనుకొన్నగుఱ్ఱాలు కొన్ని గెలిచినవి. నిన్నటి పందెములలో ఈ క్రింది ఫలితములు చేకూరెను: సిమ్లాప్లేట్ 2వ డివిజన్ (7 ఫ) (1) నోటేన్ (యాక్‌కెబ్లాక్) (2) గేరన్ (ఏ. ఖాన్) (3) కిల్లార్నీ (శంకర్) (4) లిల్లీ ఆఫ్ ది వాలీ డివిడెండ్లు రూ. 28 గెలుపునకు రూ. 14, 15, 16 ప్లేసులకు. సిమ్లాప్లేట్ డివిజన్. (7 ఫ) (1) టాపిక్ (రవుత్) (2) టక్కర్ (యాక్‌కే బ్లాక్) (3) బేగంచిటార్ (శంకర్) (4) బిల్లీబాయ్ (బి. మార్కేడ్) డివిడెండు రూ. 38 గెలుపునకు రూ. 14, 20 14 ప్లేసులకు.

జమ్మూప్లేట్ (7 ఫ) (1) ఆరెకట్ (శంకర్) (2) లక్ష్మీగార్ (మొహిదీన్) (3) టాప్ డాన్సు (యాక్‌కే. బ్లాక్) (4) పబిల్ షైవన్ (హెండర్సన్) డివిడెండు రూ 28 గెలుపునకు రూ 14,54, 30 ప్లేసులకు.

జీలంప్లేట్ (6 ఫ) (1) భస్తుగారు (శంకర్) (2) సిల్వర్ బెల్ (హెచ్‌బ్లాక్) (3) ఫ్లయింగ్ జెస్టర్ (మార్కేడ్)(4) కేసర్ సింగ్ (మొహిదీన్) డివిడెండు రూ 30 గెలుపునకు రూ 12, 10, 16 ప్లేసులకు.

రెస్‌క్లబ్ కప్ (6 ఫ) (1) లాజవాబ్ (కైరిల్) (2) వాజముద్దీన్ (రవుత్) (3) జింజర్ గెరల్ (మార్కేడ్) (4) పాట్రిషియా (హ్యాన్‌ఖాన్) డివిడెండ్లు రూ 30 గెలుపునకు రూ 16, 20, 25 ప్లేసులకు.

ఉడ్‌సైడ్ స్టేక్ (7 ఫ) (1) వింగ్ కమ్యాండర్ (శంకర్) (2) పీటర్‌వింగ్సు (హెచ్ బ్లాక్) (3) ఎమిని (హెండర్సన్) (4) ఇంపెరియల్ మెజెస్టీ (కైరిల్) డివిడెండు రూ 32 గెలుపునకు రూ 10, 12, 40 ప్లేసులకు.

మోతల్‌ప్లేట్ (1 మై 1 ఫ) (1) మయూరి (యాక్. కే. బ్లాక్) (2) ప్రైడ్ ఆఫ్ నేతు (బ్లాక్, కైరిల్) (3) హోదర్ హార్స్ నెక్ (4) హిల్ సలాం (ఫిట్జ్‌రాయ్) డివిడెండ్లు రూ 14, 26, 32 ప్లేసులకు.

# "జాతిని దృఢపరచి స్వాతంత్ర్యం నిలుపుకొనటం ముఖ్యం"

## సంకుచిత స్వార్థాభిలాషలకులోనై దేశాన్ని కూలదోయవద్దని పటేల్ హెచ్చరిక

అలహాబాద్, నవంబర్ 27: "మన మంతా ఏకంగానిలచి జాతిని దృఢపరచి మన స్వాతంత్ర్యాన్ని సుస్థిరముగా చేసుకోవలెను. స్వాతంత్ర్యాగమనానికి ముందు ఏగాలికిపడితే ఆ గాలివాటుకు కొట్టుకొనిపోయే ఓ ద వ లె, శ్రమమార్గాన్నితప్పి చాల పర్యాయ పోయి ఉన్నాము. సంకుచిత స్వార్థాభిలాషలకు లోనై దేశ స్వాతంత్ర్యాన్ని అమ్మటానికి పాల్పడే దుర్బుద్ధులు తిరిగి మనలో జన్మించకముందే మనం సక్రమమార్గంలో ప్రవేశించి మనదేశాన్ని అత్యుత్తమ వాసయోగ్య ప్రదేశంగా మార్చవలసియున్నది. మనంవెనుక అనేకసార్లు సంకుచిత స్వార్థాభిలాషకు లోనై దేశస్వాతంత్ర్యాన్ని అమ్మివేసినట్లూ, దేశ క్షేమంకన్నా స్వార్థ ప్రయోజనానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడినట్లూ మనచరిత్ర తెలుపుతున్నది. దేశం కష్టపరిస్థితుల నెదుర్కొనేటప్పుడు చరిత్రలోని గుణపాఠాలను మరచిపోకూడదు. మీరందరి హృదయాలలోనూ మీ మాతృభూమి యొక్క శ్రేయస్సే పీఠంవేసుకునిఉండవలెను. మీరు ఎవరు ఏ పనిని చేస్తున్నప్పటికీ, జాతీయ దేశగౌరవ ప్రతిష్ఠలను ప్రధానంగా చూసుకుని దారిద్ర్యపీడితులైన మీ సజాతీయులు ఆర్థికంగానూ, నైతికంగానూ అభివృద్ధి చెందుటకు తోడ్పడవలెను, దేశ స్వాతంత్ర్యానికి హాని కలిగించే పనిని దేనినీ చేయవద్దు. సర్వకాలం సర్వావస్థలలోనూ అప్రమత్తులైఉండి, మీ ప్రాణాలర్పించి అయినా స్వాతంత్ర్యాన్ని రక్షించవలెను." అని భారత సహాయ ప్రధాని సర్దార్ వల్లభాయిపటేల్ నేటి మధ్యాహ్నం అలహాబాద్ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ హెచ్చరించెను.

నేటి స్నాతకోత్సవములో అలహాబాద్ విశ్వవిద్యాలయం సర్దార్ పటేలుకు గౌరవపూర్వకంగా 'డాక్టర్ ఆఫ్ లాస్' పట్టమునిచ్చి సత్కరించెను. పట్టప్రదానోత్సవమునకు అనేకమంది ప్రముఖులు వచ్చిరి. అలహాబాద్ విశ్వవిద్యాలయ చాన్సెలర్ (రాష్ట్రగవర్నర్) శ్రీమతి సరోజినినాయుడు అధ్యక్షత వహించెను.

## పటేల్ ప్రసంగం

పట్టప్రదానోత్సవమునకు వచ్చిన విద్యార్థులను, పౌరులను హెచ్చరించుచూ సర్దార్ పటేల్ ఈ క్రిందివిధముగా ఉపన్యసించెను:

"మీ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ఉపన్యసించుటకు ఆహ్వానించటం వల్లనూ, నాకు గౌరవ పూర్వకంగా 'డాక్టర్ ఆఫ్ లాస్' బిరుదునిచ్చి సత్కరించటంవల్లనూ రెండు విధాలుగా నన్ను గౌరవించి ఉన్నారు. దీనికి నేను కృతజ్ఞుడిని. ఇంతకుముందు ఈ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవాలలో ఉపన్యసించిన దిగ్గంతులవంటి పండితులనూ, ఉన్నత వ్యక్తులనూ తలంచుకుంటే, ఏ విధమైన పాండిత్య ప్రకర్షలులేని నాకు చిన్నతనంగా ఉన్నది. విద్యావ్యాసంగాలలోనూ కళాక్షేత్రాలలోనూ నేనేమీ పేరు కెక్కలేదు. నేను చేసినపని అంతా బీదరైతుల మట్టి గుడిసెలలోనూ, పట్టణాలలోని దరిద్రుల గూడేలలోనూ మాత్రమే చేసితిని. నేను నా ప్రజాహిత జీవనంలో మార్క్ ఆంటోని (రోమచక్రవర్తి జూలియస్ సీజరుకు ఆంతరంగికమిత్రుడు. అతని అనంతరం కొన్నాళ్లు రోము సామ్రాజ్యనిర్వాహకుడు)వలె ఉన్నది ఉన్నట్లు చెప్పుతూ ఉన్నాను. నాకు అద్భుతమైన మేధస్సూ, ఉన్నతమైన హృదయము ఉన్నవని మీరు చేసిన ఉదహరణ దేశంలోని సామాన్య ప్రజలకే అన్వయిస్తున్నవని నేనుఅభిప్రాయ పడుతున్నాను.

## స్వాతంత్ర్యోద్యమం - తరువాత

ఎంతో అమూల్యమైన స్వాతంత్ర్యాన్ని మనకు లభింపచేసిన స్వాతంత్ర్యోద్యమంలోని కొన్ని అంశాలను మన మిప్పుడు పరిశీలిద్దాము. సత్యం, అహింస అనేవి ఆ ఉద్యమంలోని ప్రధానలక్షణాలు. ఆత్మార్పణం, కష్టసహిష్ణుత, స్వార్థత్యాగము అనేవి ఆ ఉద్యమయోధుల పతకాలు. ఇతరులపట్ల సహనము, అన్యోన్య సహకారము, ఐకమత్యము అనేవి ఆ ఉద్యమానికి బీజాక్షరాలు. సేవా వ్రతమన్నదే ఉద్యమంలో మనకు ధ్రువనక్షత్రంవలె మార్గదర్శిని అయినది. ఏవిధమైన సంకుచిత స్వలాభాపేక్షలు లేకుండా మనం పోరాటం జరిపి ఉన్నాము. కాని ఆ పోరాటంలో మనను నడిపిన మహానాయకుడు మనలను వదలి వెళ్లిన సం॥ లోపునే మనం ఆ ఉన్నతాదర్శాల నన్నిటినీ విస్మరిస్తున్నాము. ప్రస్తుతం మనకు అధికారవ్యామోహం, కుట్రలు ఎక్కువ ప్రియంగా ఉన్నవి. మన హృదయాలలో సౌజన్యము తొలగి విస్తున్నది. కాని మనం నోటిమాటలతో సత్యవ్రతాన్ని ఒకజపనిగా పాడుతున్నాము. ఇవన్నీ ఎందుకు చెప్పవలసి వచ్చినదంటే, ప్రస్తుతం మనం వెనుకటి కంటే కూడా ఎక్కువ నియమబద్ధులమై ఉండి పరిస్థితులను ఎదుర్కోవలసిఉన్నది. కాబట్టి ఇప్పుడు ప్రబలుతున్న ఈ నియమరాహిత్యం మొదలైనవి చాల ప్రమాదహేతువులని చెప్పవలెను.

జాతీయనాయకుడు ప్రధాని నెహ్రూ కిందటిసారి మీస్నాతకోత్సవంలో ఉపన్యసించినప్పుడు దేశం చాల క్లిష్టపరిస్థితులలో ఉన్నది. పంజాబులోని ఘోరదురంతాలు ఒక వెల్లువవలె మనలను దాదాపు కూలద్రోసినవి. కాని మనస్వాతంత్ర్యం, ఎంతో తేలిక పునాదులమీద కట్టినట్లు కనిపించినప్పటికీ, ఆ మొదటి దెబ్బకు తట్టుకొని నిలబడ కలిగినది. మనం ఎంతో కష్టపడి సాధించిన ఆ స్వాతంత్ర్యపువిలువను మీరు గ్రహించారా? స్వాతంత్ర్యాగమనంతో ఏర్పడిన బాధ్యతలకు తగినట్లు మీరు నడుచుకుంటున్నారా? మనం మన గత అనుభవాలను పట్టి అయినా గుణపాఠాలను నేర్చుకోవలసి ఉన్నది.

## ప్రపంచయుద్ధం ఫలితాలు

స్వాతంత్ర్యం వచ్చినప్పుడు, మనం మన దేశంలోనూ, అంతర్జాతీయంగానూ అనేక విషమపరిస్థితులలో నిమగ్నులమై ఉన్నామన్న అంశాన్ని అంతా గుర్తించవలెను. గత ప్రపంచ యుద్ధానంతరం శాంతి అనేది అత్యంతాకస్మికంగా ఏర్పడినది, యుద్ధం వలన ఏర్పడిన సందిగ్ధస్థితి, దాని ననుసరించిన ఆయోమయపరిస్థితులలో మనం కొట్టుకుంటు ఉన్నప్పుడే, యుద్ధం ఆగిపోయి శాంతి అతిత్వరగా వచ్చినది. యుద్ధం వలన మన ఆర్థికవ్యవస్థ అంతా తారుమారై పోయినది. అధికలాభాపేక్షతోనూ, వస్తుకొటకంతోనూ ప్రజల నైతిక లక్ష్యం చాలవరకు దిగజారిపోయినది. బానిసత్వపు సంకెళ్లు తెగిపోతుంటే ప్రజలు స్వాతంత్ర్యం వస్తున్నదని గుర్తించక స్వైరవిహారానికి వచ్చిన స్వేచ్ఛగా భావించారు.

## ప్రస్తుత సమస్యలు

ప్రపంచమంతా ఎదుర్కొంటున్న విషమసమస్యలను కూడా ఎదుర్కోవలసి వచ్చినది. ఆర్థికంగానూ, రాజకీయంగానూ మనం ఒక పెద్ద అఖాతం అంచున నిలబడి ఉన్నాము. ఏ మాత్రం పొరబడినా తీవ్ర ప్రమాదం తప్పదు. జీవిత నిర్వహణవ్యయం నానాటికి పెరిగిపోతున్నది, ఉత్పత్తి చాలినంతలేదు. దిగుమతుల ఖరీదు బహుభారంగా ఉన్నవి. ఆర్థిక వాణిజ్యాలు మందగించిపోయినవి. మన నూతన పరిస్థితులకు తగినట్లుగా, మన రాజకీయ పరిహద్దులలో కలిగినమార్పులకు తగినట్లుగా మనం సర్వవ్యవస్థలనూ సంస్కరించుకోవలసివున్నది. మన యుద్ధాంగాలలో నౌకా, వైమానికబలాలు ఇంకా శైశవదశలోనే వున్నవి. సైన్యాన్ని ఆధునికపద్ధతులపై అభివృద్ధిచేసి మన సరిహద్దుల నన్నిటినీ రక్షించుకోవలసివున్నది.

పొలాలలో దున్నే రైతులకూ, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులకూ యజమానులతోగల సంబంధాలను మార్చవలసివున్నది. మనదేశాన్ని ఆంతరంగిక శత్రువులనుండి కూడా కాపాడవలసివున్నది. దేశానికి ఎక్కువగా హానికలిగేది, ఎప్పుడూ అంతరంగిక శత్రువులవల్లనే. ఆసియాఖండంలో అత్యధికభాగం అంతర్యుద్ధాలతో నాశనమవుతున్నది. అంతశ్శత్రువులనుండి కాచుకొనుటయేకాక మనం చేయవలసినవి చాల వున్నవి. ప్రజల జీవిత పరిస్థితుల ప్రమాణాలను హెచ్చించటం, జాతీయ విశిష్టతను సృష్టించటం అనేవి మనం చేయవలసివున్నది. దేశంలోని సంపదలన్నిటినీ శాస్త్ర సహాయంతో సక్రమంగా వినియోగించుకొనటంవల్ల మొదటిపనీ, జాతీయ విద్యావిధానాన్నంతా సంస్కరించటం వల్ల రెండవపనీ నెరవేరగలవు.

## భారత సంస్థానాలు

సంస్థానాలన్నిటినీ ఐక్యంచేసి, ప్రజాస్వామికాలుగాచేయటం సాధ్యపడినందుకు నన్ను ప్రశంసిస్తూ అనేక సందేశాలు, ప్రశంసలు చేయబడినవి. ఈ ప్రశంసలకు తగినసమయం అప్పుడే రాలేదు. ముఖ్యమైనపనిముందే వున్నది. ఈకొత్త ఖండాలన్నిటిలోనూ మనం దృఢమైన సక్రమ పరిపాలనను నెలకొల్పవలెను. వాటిని భారతదేశ వ్యవస్థలో పూర్తిగా ఇముడునట్లు చేయవలసి ఉన్నది. ఇదంతే కష్టసాధ్యమో విచారంతా గుర్తించవలెను. అనేక సంస్థానాలలో స్థానిక స్వపరిపాలన సమేలేదు. రాజకీయసంస్థలు బాధ్యతాయుత ప్రభుత్వాలు మిగిలిన దేశంలోవలె ప్రజలలో పాతుకొనలేదు. ఒక్కదెబ్బతో మనం ఈ సంస్థానాలన్నిటిలోనూ నూతన విధానాన్ని ప్రవేశపెట్టితిమి. ఇవన్నీ అక్కడ పాతుకునేటంతవరకూ అక్కడ అరాజకం ఏర్పడే ప్రమాదం ఉన్నది. అంతవరకూ సంస్థానాల సమస్య పరిష్కారం కాలేదనే చెప్పవలెను.

## మన కర్తవ్యం

మనకుగల సమస్యలన్నిటనీ వివరించి ఉన్నాను. వాటిని ఎదుర్కొనటానికి తగినటుగా మనం ప్రవర్తిస్తున్నామో లేదో పరిశీలించుకోవలెను. మనమంతా దేశాభివృద్ధికై పాటుపడవలసిన ఈసమయంలో రాష్ట్రీయ దురభిమానాలు పెట్టుకుని అర్థంలేని భాషారాష్ట్రాలకోసం పెనుగులాడుతున్నాము. రాజకీయంగా ఒకటిగా ఉండవలసి ఉండగా, భిన్న సిద్ధాంతాలతో చీలిపోతున్నాము. ఉత్పత్తిని అధికంగా చేసి పరిశ్రమలను పెంపొందించవలసి ఉండగా సమ్మెలు, బాకవుట్లతో అవకాశాలన్నిటినీ పాడుచేసుకుంటున్నాము. ఎంతో పొదుపుగా జీవితం గడపవలసి ఉండగా, దుబారాచేసి అనవసర విలాసాలకు ధనం వ్యయంచేస్తున్నాము. ఉత్తమశీలము, క్రమశిక్షణ, శారీరకదార్ఢ్యము చాలా అవసరమై ఉన్నవి. అవి ఉన్నవో లేవో మనమే పరిశీలించుకోవచ్చును. ఐకమత్యంతో దృఢంగా నిలబడటంకన్నా పరస్పరం స్పర్ధించటమే మన తత్వాలకు సరిపడినట్లున్నది.

మనమంతా ఏకంగా నిలబడి జాతిని దృఢపరచి స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవలసి ఉన్నది. స్వాతంత్ర్య సంపాదనకన్నా స్వాతంత్ర్య రక్షణే ఎక్కువముఖ్యం. సంకుచిత స్వార్థాభిలాషలకు తిరిగి లోనుకాకముందే మనం దేశాన్ని బలపరచవలసి ఉన్నది. విదేశవ్యవహారాలలో పాల్గొనటం, అభివృద్ధి పథకాల ప్రారంభం, రక్షణసైన్యాల అభివృద్ధి మొదలైన బ్రహ్మాండమైన కార్యక్రమాలను మనం ప్రారంభించి ఉన్నాము. వాటినన్నిటినీ మనం నిర్వహించుకోవలసి ఉన్నది. నదీప్రాజెక్టులను నిర్మించుకోవలసి ఉన్నది. మనదేశం వ్యవసాయం ప్రధానవృత్తిగా కలది కాబట్టి, ఏడాదికి కొన్ని నెలలు పనిలేకుండా ఉండే వ్యవసాయ కూలీల యోగక్షేమాలను చూడవలసిఉన్నది. లక్షలాది వ్యవసాయకూలీల, వారి కుటుంబాలకు ఉపయోగపడటానికి గృహపరిశ్రమలను కూడా ప్రోత్సహించవలెను.

విద్యార్థులకే కార్యక్రమంలో చాల ముఖ్యమైన బాధ్యత ఉన్నది. మేమంతా మా జీవితచరమదశలో ఉన్నాము. ఇక దేశనాయకత్వం, బాధ్యత మీ భుజాల మీదనే పడగలవు. మీరు జీవిత ప్రవృత్తులను నిర్మించుకునేస్థితిలో ఉన్నారు, కనుక నేను చెప్పిన అంశాలను గుర్తించి వాటికి తగినట్లుగా తయారు కావటానికి ప్రయత్నించవలెను. ఎటువంటి పరిస్థితులలో నయినా దేశగౌరవప్రతిష్ఠలకు కళంకం వచ్చే పనులను చేయవద్దు. ప్రాణాల నర్పించి అయినా దేశస్వాతంత్ర్యాన్ని కాపాడవలెను." సర్దార్ పటేల్ హిందీలో మాట్లాడెను.

సర్దార్ పటేల్ ప్రసంగం అయినతరువాత శ్రీమతి సరోజినినాయుడు సర్దార్ గుణగణాలనూ, దేశానికి ఆయనచేసినసేవను గాంధీజీతో ఆయనకుగల సాహచర్యాన్నీ ప్రశంసిస్తూ మాట్లాడెను. సంయుక్త రాష్ట్ర విద్యామంత్రి సంపూర్ణానంద్, లక్నో విశ్వవిద్యాలయ వైస్‌చాన్సెలర్ ఆచార్య నరేంద్రదేవ్ గార్లకు గౌరవపూర్వకముగా "డాక్టర్ ఆఫ్ లిటరేచర్" బిరుదులు ఇవ్వబడెను. సంయుక్తరాష్ట్ర ప్రధాని, కొందరు మంత్రులు, అలహాబాద్ హైకోర్టు న్యాయమూర్తులు, కాశీ విశ్వవిద్యాలయ వైస్‌చాన్సెలర్, ఇతర ప్రముఖులు స్నాతకోత్సవమునకు విచ్చేసిరి.

## పటేల్ అభినందన గ్రంథం

అలహాబాదు, నవంబరు 27: ఈ ఉదయం ఇచ్చట ప్రభుత్వ భవనమునం దేర్పరుప బడిన ఒక సమావేశమునందు, సంయుక్త రాష్ట్ర ప్రధాని పండిత్ గోవింద వల్లభ పంత్ గారు, 'పటేల్ అభినందనగ్రంథము' అను పేర, ఆయన జన్మదిన సందర్భమున వచ్చిన శుభాభినందనములన్నియు సంప్రటీకరింప బడిన యొక సంచికను సర్దార్ జీకి సమర్పించిరి.

ఈ సంచికకు జ్యోతిఃప్రసాద నిర్మల్ గారు సంపాదకులు. బాబూ పురుషోత్తమదాస్ టాండన్‌గారి ప్రవేశికతో వెలువరింప బడినది.

ఆ ప్రవేశికలో, "నవీనభారత స్వరూప నిర్మాణమునందు పటేలుగారి సేవ అమేయమైనది. చిక్కుల పొంతగా నున్న సంస్థానముల సమస్యను పరిష్కరించుటలో ఆయన చూపిన చాకచక్యము శ్లాఘనీయమైనది" అని టాండన్‌గారు పటేలుగారి సేవను ఉగ్గడించిరి.

---

## తూర్పుగోదావరి నూలు పంపకం

రాష్ట్రీయ టెక్స్‌టైలు కమిషనరు శివరామనుగారుఇట్లుప్రకటించుచున్నారు:

తూర్పుగోదావరిజిల్లాకు నూలు కోటా గూర్చి కొన్నివిన్నపములు వచ్చినవి కనుక యీ దిగువ వివరాలు తెల్పుచున్నాను. ఇదివరకు కంట్రోలు సమయమున ఆ జిల్లాలో 18900 మగ్గాలున్నట్లు అందు 15137 సహకారసంఘములకు చేరినవని తెలిసెను. వివిధ నెంబరుల నూలు 964 బేళ్లు ఆ జిల్లాకు పంపబడెను. అందు 704 సహకారసంఘముద్వారాను 260 ప్రయివేటు వర్తకులద్వారాను యివ్వబడెను.

# వస్త్రసమస్య

## రాష్ట్రప్రభుత్వ విధానంపైకౌన్సిల్‌చర్చ

### విమర్శలకు సీతారామరెడ్డి గారి సమాధానం

చెన్నపట్నం, నవంబరు 28: నిన్న మధ్యాహ్నం మదరాసు కౌన్సిల్ ప్రభుత్వ వస్త్రవిధానమును, రాష్ట్రవస్త్ర సమస్యను చర్చించిరి. ఉదయం ప్రశ్నల కాలానంతరం డా॥ రాజన్‌గారి ప్రతిపాదనపై కౌన్సిల్ ఆహార సమస్యను చర్చించెను. చర్చకు రాజన్‌గారు సమాధానమిస్తుండగా సమావేశం ఫలహారమునకు విరమింపబడెను. అనంతరం తిరిగి సమావేశమైనపుడు రాజన్‌గారు తమఉపన్యాసమును ముగించిరి (మొదటి భాగము నిన్నటి పత్రికలో పూర్తిగా ప్రకటింపబడినది. మిగతాచర్చ ఇచట ప్రచురించడమైనది) కౌన్సిల్ సమావేశం తేదీ నిర్ణయం లేకుండా వాయిదా వేయబడింది.

ఫలహారానంతరం మంత్రి డా॥ రాజన్‌గారు తమ ప్రసంగమును కొనసాగించుచూ, భారత ప్రభుత్వం మద్రాసు రాష్ట్రానికి నిర్ణయించిన కోటాలను సంవత్సరంవారీగా వివరించి చెప్పిరి. మద్రాసు ప్రభుత్వం భరించిన ఖర్చు 1947 లో అక్టోబరు వరకు రు. 3 కోట్ల 6 లక్షలు. వ్యవసాయపు ఖర్చులు నూటికి 100 పైన 209 వంతులు వరకూ పెరిగింది. ధాన్యం ధర నూటికి 217 వంతులు పెరిగింది. ఇప్పుడు పెంచిన ధరల ప్రకారం బియ్యం ధర నూటికి 275 వంతులు హెచ్చింది. ఆహారం కొనుబడిపై మద్రాసు ప్రభుత్వం వెచ్చించిన రు. 3 కోట్ల 6 లక్షలపైన భారత ప్రభుత్వం రు. 12 కోట్లు వెచ్చించింది.

ఇప్పుడు 10 లక్షల టన్నులు పాలీనా కావలెనని మద్రాసు ప్రభుత్వం భారత ప్రభుత్వాన్ని కోరింది. దీనినికొని స్థానిక ధరలకు అమ్ముచున్నందువల్ల వచ్చు నష్టంలో నాలుగోవంతును రాష్ట్రప్రభుత్వం భరించవలసియున్నది. అందువల్ల యెంత అధికంగా కోరిన అంత ధనమును యీ రాష్ట్రప్రభుత్వం వెచ్చించవలసియుండును. అందువల్ల దిగుమతి పెంచుకొనుటకంటె, బ్లాక్‌మార్కెట్‌ను అణచివేసి సేకరణను హెచ్చించవలెననీ, ఉత్పత్తిని వృద్ధిపరచవలసియున్నదనీ డా॥ రాజన్‌గారు చెప్పిరి. కంట్రోల్‌ను సక్రమంగా నిర్వహించుటకు ప్రజలు సహకరించవలెననిరి. ఉత్పత్తిదారులు ప్రభుత్వధాన్యసేకరణ కార్యక్రమంలో సహాయపడవలెననిరి. బ్లాక్‌మార్కెట్‌ను, ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనమును నిర్మూలించుటలో కూడా ప్రజలు ప్రభుత్వమునకు తోడ్పడవలెననిరి.

ఇకనుంచి భారత ప్రభుత్వంచే సేకరించబడిన ధాన్యానికిగాను ఉత్పత్తిదారులకు బోనస్సులు ఇవ్వబోవడంలేదని స్పష్టపరిచినట్లు మంత్రిగారు చెప్పిరి.

వంగరాష్ట్రంలో ఆహారం అపారంగా ఉన్నప్పుడు గూడా క్షామం సంభవించి లక్షలాది ప్రజలు ఆకలివల్ల చనిపోయిరి.

(ఈ సమయానికి దాదాపు 40 మంది సెకండరీస్కూలు విద్యార్థులు విజ్ఞరుల గాలరీకి వచ్చి కూర్చున్నారు. "భావిశాసకులు" వచ్చినారని ఆధ్యక్షులనిరి.) ప్రస్తుతపు ధాన్యం ధరలు న్యాయముగా నున్నవని మంత్రిగారనిరి. ఇంక హెచ్చించుట కూడా అసాధ్యమనిరి. ప్రజల సహకారంతో ఈ సంవత్సరం రాష్ట్రము నెట్లు కాపాడగలిగినారో, ఇకముందుకూడా ఆహార విషయంలో రాజకీయాలను చేరనివ్వకుండా ప్రజలను కాపాడగలరని డా॥ రాజన్‌గారు చెప్పిరి. డా॥ రాజన్‌గారి తీర్మానం అంగీకరించబడింది.

## ప్రభుత్వ వస్త్రవిధానం

శ్రీ హా. సీతారామరెడ్డిగారు ప్రభుత్వం వారి వస్త్ర పంపకవిధానం చర్చించవలెనని ప్రతిపాదించిరి. ప్రతికూలపక్ష నాయకుడు సూచించిన కొన్ని సందేహాలకు బదులు చెప్పుచు ఈ రాష్ట్రంలో క్రొత్తమిల్లులు స్థాపించనున్నారనియు, విదేశాలనుండి దిగుమతియే వస్త్రాలకు కంట్రోలు లేదనియు, మిల్లువస్త్రాలు ఎన్ని కంపెనీవారివి 1000 బేళ్లతప్ప యితర సరుకు ఎగుమతి అనుబడలేదనియు, బొంబాయి ప్రాంతంనుండి 118000 బేళ్లు దిగుమతి అనుచున్నవనియు, ఖద్దరు ఎంత ఉత్పత్తిఅగుచున్నదో తెలియదనియు, చేనేతవస్త్రాలు 4000 బేళ్లకన్నా ఎక్కువగానే యీ రాష్ట్రంనుండి ఎగుమతి యగుచున్నవనియు తెలిపిరి. పాలీనా రాష్ట్రానికి 3,81,000 బేళ్ళు కావలసియున్నవనిరి. చేనేతవస్త్రాలు 28,00,000 బేళ్ళు వాడుక యగునవనిరి.

డా॥ జానుగారు ప్రసంగించుచు, కాంగ్రెసుప్రభుత్వం వచ్చినదగ్గరినుంచి ఖద్దరు ఉత్పత్తికొరకై మిల్లులపై ఆధారపడినదనియు, ఖద్దరు ఉత్పత్తి ఎక్కువ కాలేదని చెప్పిరి. సుమారు నాల్గులక్షల బేళ్ళు కావలసియుండగా, నాల ఎక్కువగ 79,700 బేళ్ళుమాత్రం తయారు చేయుచున్నప్పుడు, లోటు తీర్చుటకు ప్రభుత్వంవారు ఏమి చేయదలచిరో చెప్పడంలేదనిరి. ప్రభుత్వం వారు ప్రాతవ్యాపారస్తులలో సగంమందికి లైసెన్సులు యివ్వడం మానివేసిరి. కాని ఈ లైసెన్సులివ్వడంలో ముస్లిములకుగాని యింకేజాతివారికిగాని అన్యాయం చేయలేదని చెప్పవచ్చు. కాని యితర విషయముల అన్యాయం జరిగింది. లైసెన్సులు యిచ్చి కంట్రోలు చేయుటకన్న ఉత్పత్తి ఎక్కువ చేయాలి. మిల్లులు, మగ్గాలు ఎక్కువచేయాలి గాని, అభిమానంచూపవన వ్యాపారస్తులను ఎంచి నియమించిన లాభంలేదు.

ఆర్. సూర్యనారాయణగారు బొంబాయిలో కొనే వ్యాపారస్తుల తరఫున ప్రతినిధులను పంపుటవల్ల వస్త్రాలధర పెరిగిపోవుననిరి. టోకు వ్యాపారస్తులలో 160 మంది క్రొత్తవారినెందుకు నియమించాలి? నిరాకరించిన ప్రాతవారంతా యిదివరకు నియమాలను ఉల్లంఘించిరా? నూలుపంపకం సహకారసంఘాలు సరిగా చేయలేకపోయినచో కారణములేమయినచో కారణములేమిటని ప్రభుత్వంవారు తెలుసుకొనిరా?

ఇబ్రహీంగారు, మనరాష్ట్రంలో చేనేత పరిశ్రమ విదేశాలకు ఎగుమతులవల్ల బ్రతుకుచున్నదిగాని, రాష్ట్రంలో చేనేత వస్త్రాల ఖర్చువల్ల కాదనిరి. ఇటీవల ఎగుమతులు నిషేధించుటవల్ల చేనేతవస్త్రాలు ఖర్చుకాక మిగిలిపోయి, వర్తకులు నష్టపోవుచున్నారని, ఆరకం వస్త్రం యిచట ఖర్చు కాదనియూ చెప్పిరి.

సి. చలమాజిగారు, గాంధిగారు తీసేమని చెప్పిన కంట్రోలు తిరిగి అమలుజరుపుట భావ్యంకాదని తెలుగులో ప్రసంగించుచూ తెలిపిరి. 5000 మంది ప్రాత వ్యాపారస్తులలో 609 మందినే ఎంచుటవల్ల తక్కినవారికి పనిలేదనియూ, రూపాయి పావలావడితో 5000 వరకు డిపాజిటు పుచ్చుకోవడం అనవసరమని, ఉన్నచోటకాక పైచోట్ల దుకాణం పెట్టుకోవలసిన యీ లైసెన్సుదారులకు ఎంతో నష్టంకలుగుననియూ, సహకార సంఘములవారు ప్రయివేటు నేతగాండ్రకు నూలివ్వ నిరాకరిస్తున్నారనియు, సహకారసంఘాలు... దొంగవ్యాపారం చేస్తున్నట్లు జిల్లాకలక్టరుకి తాను ఫిర్యాదు చేస్తేగూడ, హెచ్చరించి విడిచిపెట్టిరనియూ చెప్పిరి.

...నాకిగారు, వర్తకులవద్ద డిపాజిటులు పుచ్చుకొని వర్తకులను ఎంచినపిదపకూడ, వర్తకుల తరఫున కొనేవారు ఎట్లా వచ్చేరని అడిగిరి. కేంద్రప్రభుత్వంవారు కోటా ఎక్కువచేసినపిమ్మట యింకా ఎక్కువ మందిని నియమింతురాయని అడిగిరి.

రామనాథం చెట్టియారు, 80 నెంబరు నూలు కావలసిన జిల్లాలకు 40. నెం. పంపి, 40 కావలసినచోటికి 80 పంపి కష్టాలు పెడుతున్నారని, ఐ.సి.ఎస్ వారికి ఉద్యోగస్థులకు వ్యాపారం తెలియదనియు, సహకారసంఘాల దుకాణాలు ఉద్యోగుల కన్న పొగరుగా జవాబులు చెప్పుచుందురనియు నుడివిరి. టోకు వ్యాపారంలోను, చిల్లర వ్యాపారంలోగూడ సేల్సుటాక్సు తీసుకోవడం భావ్యంకాదనియు చెప్పిరి.

కుమారస్వామి మదల్యారు మనరాష్ట్రానికి అవసరంలేని 10 మూళ్ళ పంచలు 6 మూళ్ళ చీరలు వస్తున్నాయి. అవి రాకుండా చేస్తే బాగుండుననిరి.

ఎన్. శంకరరెడ్డిగారు ప్రాత ప్రభుత్వాన్ని మరకనుస్పష్టన్నందుకు విమర్శించుట సరికాదనియు, విదేశాలనుండి యంత్రాలకు డబ్బుపోయుటకు బదులు, గ్రామస్థులకు పని కల్పించుటకు కాంగ్రెసు సిద్ధాంతము ననుసరించి ఆ ప్రభుత్వం అట్లు చేసెననిరి. మిల్లువస్త్రాల మోజు పోవాలి. మన రాష్ట్రం చేనేతవస్త్రాలు యితరదేశాలవారికి నచ్చినవి. వాటి ఎగుమతి తగ్గినందున చేనేతవారు పనిలేకుండా పోతున్నారు. కనుక చేనేతవస్త్రాలవాడుక ఎక్కువచేయాలి. గ్రామ పరిశ్రమలకు ప్రాధాన్యమివ్వాలనిరి.

దామోదర కృష్ణమూర్తిగారు, తిరిగి కంట్రోలు అమలుజరపడం అవసరమని 2000 పైగానున్న టోకు వ్యాపారస్తులలో 600 మందికి మాత్రమే లైసెన్సునిచ్చి తక్కినవారికి పనిలేకుండా చేసిరనిరి.

### మంత్రిగారి జవాబు

మంత్రి సీతారామరెడ్డిగారు చర్చకు బదులు చెప్తూ, ప్రభుత్వం వారు కంట్రోలు సడలించిన అమలు జరుపలేదనియు, వర్తకులు ధరలు మూడు నాల్గురెట్లు పెంచుటచేతనే, తిరిగి కంట్రోలు అమలుజరుపవలసి వచ్చెననిరి. నూలు కోటాలో సగం సహకార సంఘాలకు ఒప్పగించబడెను. వస్త్రాలలో 1/3 వంతే సహకార సంఘాలకు ఒసంగబడెను. ప్రయివేటు వర్తకులు ఎక్కువ ధరలకు విక్రయించకుండా పోటీగా నుండాలనిమే యిట్లు చేసితిమి. అందుచే ప్రాత వ్యాపారస్తులను కొందరిని నిరాకరించవలసి వచ్చెను. కంట్రోలు కాలంలో 900 లకు మించి టోకు వ్యాపారస్తు లుండేవారు కారు. వారిసంఖ్య యిప్పటికే హెచ్చించింది. కొద్ది నెలలలో కోటా పెరిగినచో లైసెన్సు వర్తకులసంఖ్య పెంచబడును. ఇదివరకు న్యాయంగా ప్రవర్తించినవారిని తొలగించే ఉద్దేశ్యంవారికి లేదు.

మిల్లులు మూడు షిఫ్టులపై పని చేస్తున్నందున ఉత్పత్తి యెక్కువయింది. కనుక నే నూలు ఎక్కువ లభిస్తున్నది. నెలకు 30,000 బేళ్లు కోటా యీ రాష్ట్రానికి సంపాదించ గలిగితిమి. అది వచ్చినచో కొరత తొలగును.

సన్ననూలు సప్లయి మన రాష్ట్రానికి తక్కువగానుండి, నిజమే. కాని ఉత్పత్తియే (80 నెం.) తగ్గించాలని కేంద్ర ప్రభుత్వంవారు అనుకుంటున్నారు, కనుక యిప్పటినుంచే సన్ననూలు మగ్గాలవారు ముతకనూలుకి మార్చుకొనే ప్రయత్నించుట మంచిది. సన్ననూలు హైదరాబాదుకి దొంగతనంగా పోవుటచే లోటు వచ్చెనని తెలిసెను. కంట్రోలు అమలు జరిగినాక అది నివారింపగలం.

ఫిర్కా డెవలప్‌మెంటు ప్రాంతాల వడుకునూలు బాగా తయారయింది. కాని, అది యింకా వస్త్రంగా నేయబడలేదు. అదివరకు పొట్టునూలు నేసే మగ్గాలు ఖద్దరుకి నిర్బంధింపబడుటవల్ల పని త్వరగా చేయలేక పోవుచున్నారనియు, వారికి నష్టం రాకుండా చూసేమనియూ చెప్పిరి. యంత్రసామగ్రి ఎంత వృద్ధిపొందినా చేనేత వస్త్రాలకు, సన్ననూలుకి గిరాకీ ఉండక తప్పదు. మన రాష్ట్రంలోని చేనేతవస్త్రాలు యితర రాష్ట్రాలకు పంపి, అటనుండి మిల్లు తెప్పించుకోవాల్సి. కాని ఏ రాష్ట్రాన్ని కాని రాష్ట్రం స్వయం పోషకంగా నుండేటట్లు చేయుట కష్టం, భావ్యంకాదు. మన రాష్ట్రపు చేనేత వస్త్రాలు సగం యితర రాష్ట్రాలకు ఎగుమతి చేయదలచితిమి. స్థిరమగు సంఖ్య యింకా నిర్ణయించబడలేదు.

మనిషికి నగరంలో 18 గజాలు, గ్రామాలలో 12 గజాలు పాలీనా పప్లయి యుండాలని కేంద్ర ప్రభుత్వంవారు సూచించిరి. అన్ని రాష్ట్రాలలో యిదే లెక్కను పంపకం కోటాలు నిర్ణయించిరి.

పూర్వపు కంట్రోలు రోజులలో గూడ కొనుగోలుప్రతినిధులు బొంబాయి ప్రాంతాలకు పోయికొనుపద్ధతి గలదనియు, టోకు వ్యాపారస్తులే అది కోరి యుంచుకొనిరిగాని, యిపుడు కొందరిని అభిమానించి కొందరిని నష్టపెట్టుటకు క్రొత్తగ తెచ్చిపెట్టినదికాదు. కొనేచోట స్థానిక ప్రతినిధియుంటే, జిల్లావారిగా వాగనులలో వేసి, నిరాలస్యంగా పంపగలరు. వీరిని జిల్లాకలక్టరుల సలహా ననుసరించి సి. టి. సి. నియమించును. వ్యాపారం మతసాంఘిక ప్రాతినిధ్యాలు పొందుతున్నాయని ఫిర్యాదులు రాలేదు. హరిజనులకు పూర్వపు కంట్రోలుపద్ధతిలో కొన్ని ఎక్కువ సౌకర్యాలు ఒసంగబడెను గాని, యిపుడు ప్రత్యేకం ఏమీ ఉత్తరువు లీయలేదనిరి. టోకువ్యాపారం చిల్లర వ్యాపారంకూడ జరిపే లైసెన్సు దారులనుగూడ నియమించుటనుగూర్చి కమిషనరు ఆలోచిస్తున్నారు. హైదరాబాదు ఆక్షేపణల కొంతకాలం సరకు దిగుమతి ఆలస్యమయింది కాని యిపుడు విరివిగ వస్తున్నది. సహకార సంఘాలు వస్త్రవ్యాపారం చాల సంతృప్తికరంగా నిర్వహించినట్లు తెలిసెననియు, ప్రయివేటు వ్యాపారస్తుల ధరలు తగ్గించిరనికూడ తెలియవచ్చెను. చేనేత వస్త్రాల ఎగుమతి కోటాకూడ పెంచుటకు కేంద్రప్రభుత్వంవారి నంగీకరింప జేయగల్గితిమి. చేనేతవారి కష్టనష్టాలు ప్రభుత్వంవారికి బాగా తెలుసుననిరి.

---

## మదరాసు రేడియో

### నవంబరు 30 మంగళవారం

మదరాసు (2)

7-0 గం. స్వాగతం. 7-10 తెలుగులో వార్తలు. 7-20 రికార్డులు. 7-30 ఇ. గోపాలకృష్ణను 8-0 ఇ. వార్తలు 8-15 ...రికార్డులు. 8-30 పి. ఎస్. సరోజిని 12-30 హైస్కూళ్లకు ఆరకం, 1-0 మహిళామండలి కమలాదేవిగారు, ప్రసంగం మంచి అలవాట్లు, కలుపుగోలుతనం, ప్రసంగం 1-30 ఇ. వార్తలు. 1-40 తేర గానం. 2-5 తెలుగులో వార్తలు. 2-15 హైస్కూళ్లకు తెలుగులో అంగదేశ చరిత్ర, సామంతుల తిరుగుబాటు, ప్రసంగం. కోయంబత్తూరునుంచి 2-45 రికార్డులు. 4-0 ప్రాథమిక పాఠశాలలకు తెలుగులో ఉత్తమ అన్నయు. ఈశ్వర చంద్ర విద్యాసాగరునుంచి 4-30 ఇ. రికార్డులు. 5-30 ఎ. ఎస్. సంకల్పరాయను, 6-0 ఇ. వార్తలు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం పశువరిత్ర, పురాణం, ప్రేమలేఖ, కథానిక- జరుపు, ఆరోగ్యము, వినోదకేసాలు 7-15 తెలుగులో వార్తలు 7-30 నానాదేశ్య...ధ్వారము ...డు జి. ఎ. నరసింహారావు ప్రసంగం. 8-0 ... పి. శివానందం పిళ్లై, ఫిడేలు. 9-15 అనంతనాటకం. 9-30 రికార్డులు. 9-40 ఆర్. ఆర్. మూర్తి, పాట. 10-0 స్వాగతం

# "ఆంధ్రరాష్ట్రనిర్మాణం వెన్వెంటనే జరగాలి"

## సర్ యస్. వి. రామమూర్తిగారి హెచ్చరిక

### అపారమైన ఆర్థికసంపదతో స్వయంసమృద్ధమై నూత్నరాష్ట్రం విశిష్టస్థానాన్ని పొందగలదు

మచిలీపట్నం, నవంబరు 28: ఆంధ్ర గామ్రం నేటి అగ్రరాష్ట్రాలకు దేనికీ తీసిపోదనీ, అపారమైన ఆర్థిక సంపదతో స్వయం సమృద్ధమై స్వతంత్ర భారత దేశమున నూతన రాష్ట్రం విశిష్ట స్థానాన్ని పొందగలదనీ సర్ యస్. వి. రామమూర్తిగారు నేడిచట జరిగిన జిజ్ఞాసులగోష్ఠి ఆంధ్రవారోత్సవముల కార్యక్రమమును ప్రారంభించుచు వెల్లడించిరి. సర్ రామమూర్తిగారు, తాము గవర్నరు సలహాదారుగా నున్న కాలమున, పరిపాలనాశాఖలను విభజించుటకు నిర్ణయం జరిగిన వైనం, ఆ నిర్ణయం అమలుకాకుండుటకు కారణములను వివరించిరి. ఆర్థికంగా ఆంధ్రరాష్ట్రం మిగులు రాష్ట్రమని నిరూపించిరి.

స్వాగతోపన్యాసానంతరం సర్ రామమూర్తిగారీవిధంగా ఉపన్యసించిరి.

ఈజిజ్ఞాసువులగోష్ఠి వారు జరిపే ఆంధ్రరాష్ట్ర వారోత్సవం ప్రారంభింప నన్నాహ్వానించి గౌరవించినందుకు కృతజ్ఞుడను. ప్రజాహిత జీవనమునకు సంబంధించిన విషయాలు శాస్త్రయుక్తంగా చర్చించుటకు ప్రజాప్రతినిధుల గోష్ఠులు స్థాపించుట అమెరికా నగరములందాచారమయినది. చన్న రాష్ట్ర సమస్యలను చర్చించి నిర్ణయించుటకు మచిలీబందరులో యీ పద్ధతి అనుసరించుట చాలసంతోషము. అసలు విషయాలనుగమనించి, వాటిని సహేతుకంగా నాలోచించి చర్చించి నిర్ణయించుట శాస్త్రయుతమయిన పద్ధతి. ఒక విషయాన్ని నిష్పాక్షికంగా యోచించి, సహేతుకనిర్ణయములు గావించినాక, ప్రజాప్రభుత్వ విధానమునందు ప్రతిస్వీకృతియగు నిర్ణయములు అమలు జరుపుటకు ప్రయత్నించుటకు హక్కు గలదు. అట్టిస్వీకృతియొక్క నిర్ణయములు, ఆతని పూర్వానుభవములు అభిమాన దురభిమానముల పైన గూడ ఆధారపడియుండవచ్చును. ప్రజాప్రభుత్వ విధానమునందలి నాయకులు, ప్రజలంతా గూడ తామాలోచించినట్లే ఆలోచించి నిర్ణయించాలని శాసించుటకు వీలులేదు. ప్రజల అభిప్రాయమును తెలుసుకొని, అత్యధిక ప్రజాభిప్రాయము ననుసరించి దానిని అమలు జరుపుటకు ప్రయత్నించుటే ప్రజాప్రభుత్వ విధానమునందలి నాయక సంప్రదాయము.

కనుక, యీ జిజ్ఞాసువుల గోష్ఠివారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించిన విషయమంతా సేకరించి, వాటిపై చర్చింపదలచినవారికందరికీ అవకాశమిచ్చి వారి సుస్థిరాభిప్రాయములను తెలుసుకొని, వాటి సారముతీసి ఫలితం నిర్ణయించవచ్చును. రాష్ట్రానికి సంబంధించిన విషయములనగా చన్న రాష్ట్రపు జనాభా, రాజకీయంగా మారవలసిన చేరువ ప్రాంతాల జనాభా లెక్కలు, జాతిభాష చరిత్ర, భౌగోళిక ఆర్థికవిషయాలు; రాజకీయార్థిక అభివృద్ధికి అవకాశాలు, విజ్ఞాన ప్రకటన, పరిపాలనా సౌకర్యములు, ఆర్థిక సంపదమున్నగునవి. ఈ వివరములన్ని తెలుసుకొన్నాక, రాష్ట్రమునకు ఉత్తమమయిన ప్రమాణమేది, రాబడి ఎంత, సౌకర్యములేమిటి, ఏప్రాంతం ఎటు ఎలామారుస్తే బాగుండును, అని నిర్ణయించాలి. ఈ వారంలో ఆంధ్రరాష్ట్రం గూర్చి పైచెప్పిన విషయాలు కూలంకషంగా చర్చించి, ముఖ్యసూత్రాలు సూచించి స్థిరమగు నిర్ణయాలు, ఆంధ్రరాష్ట్రానికి అనుకూలంగానో ప్రతికూలంగానో చేయుదురనుటకు ఎట్టి సందేహం లేదు.

#### చెన్న రాష్ట్రస్థితి

ఆంధ్రరాష్ట్రం గూర్చి యీ పద్ధతిలో ఎట్టి చర్చలు జరుగగలవో సూచించిన పిమ్మట, ఆ సమస్యగూర్చి నాకు తెలిసినంత వరకు నా అభిప్రాయములను తెలుపగోరెదను. యుద్ధ సమయమున నేను గవర్నరు సలహాదారుగ నున్నపుడు చెన్న రాష్ట్రం ఒకే పరిపాలనక్రింద నుండుటకు కడు పెద్దదయిపోయిందని భావించుచుంటిని. యుద్ధానికి పూర్వము చన్న రాష్ట్రపు రాబడి రూ. 17 కోట్లు. యుద్ధానంతరము అది 40 కోట్ల వరకు పెరిగింది. చన్న రాష్ట్రపు జనాభా బొంబాయిరాష్ట్రం జనాభాకు రెండింతలు. చన్న రాష్ట్రం ఉత్తరంనుండి దక్షిణానికి వేయి మైళ్ళ నిడుపు కల్గియున్నది. వైశాల్యం కూడా తగినంత యున్నది. యుద్ధకాలంలో పరిపాలనా వ్యవహారాలు చాల పెరిగినవి. యుద్ధానికి పూర్వం జిల్లాకలక్టరు భూమిశిస్తు వసూలు చేయుట, శాంతిభద్రతలు కాపాడుట మాత్రమే చేయుచుండెను. కనుక, ఉత్తరమునన్న కడు పెద్దదగు విశాఖపట్నంజిల్లా ఒక్క జిల్లాకలక్టరుచే నిర్వహింపబడుచుండేది. పేష్కసు ఇచ్చే జమీందారులు పెక్కండ్రతోనే ఆ జిల్లా నిండియున్నది. యుద్ధసమయంలో జిల్లాలోనున్న అబాలగోపాలమునకు ఆహారం రేషను అందజేసే పూచీ కలక్టరుపై బడింది. విశాఖజిల్లాలో యీపని అంతా ఒక్క కలక్టరు ఏమాత్రం సమర్థతతో నిర్వహింపజాలడు. కనుక మదరాసు ప్రభుత్వంవారు యీ జిల్లాను రెండుగ విభజింప నిశ్చయించిరి. అపుడు నేను, కొన్ని జిల్లాలే కాక, రాష్ట్రమంతా విభజించినగాని, నానాటికి పెరుగుచున్న పరిపాలనా వ్యవహారములు చక్కగ నిర్వహింపబడవని సూచించియుంటిని. ఉన్న పరిపాలనాశక్తులు సన్నగిల్లిపోవుట లేదు, నూతన పరిపాలనాశక్తి ఉద్భవించుచున్నదని, అట్టి ప్రసవవేదనలో నున్నామని నేనంటిని. యుద్ధసమయంలోను తరువాతను ఆర్థిక సాంఘికాభివృద్ధికి చెందిన పనులెన్నో క్రమేణ పెరిగిపోవుచుండుటచే, విశాలమగు యీ రాష్ట్ర పరిపాలనాశాఖల అధికారోద్యోగులు తమ పనులను పూర్తిగ సక్రమంగా చేయుటకు వీలులేకపోవుచుండెను. ఒక్క వ్యవసాయశాఖ డైరక్టరు, ఒక్క చీఫ్ ఇంజనీరు, ఒక్క పరిశ్రమల శాఖ డైరక్టరు, ఒకే సర్జను జనరలు చాలరు. పని పెరిగిపోయింది. కనుక రాష్ట్రాన్ని రెండు భాగాలుగా విభజించుటకు ప్రభుత్వ మంగీకరించెను. అపుడు ఉత్తర, దక్షిణ భాగాలని రెండు భాగాలుగ విభజించి, ఒక్కొక్క భాగానికి, ప్రత్యేకంగా డిపార్టుమెంటులు ఏర్పాటు చేయమని నేను సూచించితిని. ఈ పథకం వివరాలు నిర్ణయించుటకు ఒక ప్రత్యేకోద్యోగిని నియమించుటకు నిశ్చయించిరి. ఆ సమయానికి తగిన ఉద్యోగి దొరక్క, ఆ పని వాయిదా పడింది. ఆటుపిమ్మట, ఇండియా చట్టం 93వ సెక్షను పరిపాలన అంతమొందుటచే, యీ సూచనకు కాలదోషం పట్టింది. ఆ సూచన ప్రకారం, కొన్ని ముఖ్యకార్యాలకు కేంద్ర సమిష్టి శాసనసభయు, యితర పనులకు ఉత్తర దక్షిణ రాష్ట్రాలకు వేరొక "సబ్ లెజిస్లేచర్లు" ఉండాలని, రెండు రాష్ట్ర భాగాలకు వేరొక డిప్యూటీ గవర్నరును నియమించాలని, వారుభయులు మదరాసు సమిష్టి గవర్నరుకి లోబడి పనిచేయాలని, మదరాసు నగరం ప్రత్యేకంగా రాష్ట్రమంతకు ఫెడరల్ కేంద్రంగా నుండాలని నేను సూచించియుంటిని.

#### నేటి కర్తవ్యం

భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకు రంగం అమర్చబడుచున్న ఈ సమయమున, యుద్ధకాలపు ఉపరాష్ట్రముల తాత్కాలిక యేర్పాటు సముచితముగ నుండదు. ఇండియాలో రాష్ట్రాలన్ని బ్రిటిషు పరిపాలనయందు చరిత్రలో దంత ప్రమాదముల వలన అనాలోచితంగా సృష్టింపబడినవి. భారతదేశమునందు జాతి భాషా నైతిక భిన్నత్వం గలదు. ఆ భిన్నత్వమునందు ఉపయుక్తమగు ప్రత్యేకత గలదు. ఆ ప్రత్యేకతను కాపాడుచు, భారతదేశ ప్రధానైక్యతను కాపాడుటకు రాష్ట్ర విభజన చేయునపుడు బ్రిటిషు యుగమునే గాక, తత్పూర్వ చరిత్రనుగూడ గమనించాలి. ఆంధ్ర రాష్ట్రమును ప్రత్యేక రాష్ట్రముగా చేయాలని నేనిప్పుడు కోరుచున్నాను. యుద్ధానంతరం పరిపాలనా వ్యవహారరీతి గాంచిన, చెన్న రాష్ట్రం ఒకే రాష్ట్రంగా నుంచి పెనుట కష్టము. కేరళ, కర్నాట భాగాలు చేరనున్న సంస్థానములు బొంబాయి రాష్ట్ర భాగములతో కలిసినాక, తమిళరాష్ట్రం ప్రత్యేకం కాగలదు.

మదరాసు నగరం తమిళులు, తెలుగులు, మళయాళీలు, కన్నడిగల సమిష్టి కృషివల్ల అభివృద్ధి చెందినది. కనుక ఢిల్లీవలె చీఫ్ కమిషనరు రాష్ట్రంగా నుంచవచ్చును. అందలి వర్తక వైజ్ఞానిక సంస్థలు నాల్గుభాషల వారికి సమానంగా ఉపయోగపడగలవు. చన్న నగరంలో అనేక లక్షలాంధ్రులు అరవలుగూడ యున్నారు. నగరాన్ని ఆంధ్రలోగాని తమిళనాడులోగాని కలుపుట అరవలకుగాని ఆంధ్రులకుగాని కష్టం కలిగించును. ఒకరు కొంచెం ఎక్కువ, ఒకరు కొంచెం తక్కువ సంఖ్యలో నున్నచో, జనసంఖ్యలు పల్టా చేసికొనవలసివచ్చును. విభిన్న భాషావర్గాలకు చెందిన ప్రజలు ఎక్కువగనున్న మహానగరము, కేంద్ర ప్రభుత్వం అధీనంలో నుంచే చీఫ్ కమిషనరుచే నిష్పాక్షికంగా పరిపాలింపబడుటే మంచిది. అపుడు ఒకభాషవారు యింకో భాషవారిపై అధికారం చెలాయించే అవకాశం ఉండదు. ఆంధ్ర, తమిళనాడులకు నూతన ముఖ్యపట్నము లేర్పడునవరకు, వాటి కేంద్రకార్యాలయాలు, చన్న నగరం ఉత్తర దక్షిణభాగాలందే యుంచుకోవచ్చును.

#### సరిహద్దులు

ఆంధ్రరాష్ట్రం సరిహద్దుల విషయంలో పడమట దక్షిణములందు చిక్కులేదు. పడమరను కాంగ్రెసు జిల్లాల విభజన పద్ధతి కర్నాటకుల ఆంధ్రులమధ్య సరిహద్దును స్పష్టంగా సూచించుచున్నది. ఆగ్నేయదక్షిణ సరిహద్దు విషయంలోగూడ, తమిళనాడు ఆంధ్రకాంగ్రెసు రాష్ట్రముల విభజననే అనుసరింపవచ్చును. చన్న నగరంలో రెండు రాష్ట్ర కాంగ్రెసు సంఘముల కార్యాలయము లుండుటచే, నగరాన్ని రెండుగా విభజించుటా లేక, రెండింటిని విడచి ప్రత్యేకంగా నుంచుటా యన్న ప్రశ్న గలదు.

ముఖ్యమయిన సరిహద్దు చిక్కు ఉత్తరాన గలదు. ఒరిస్సారాష్ట్రం ఏర్పరచినపుడు; జయపురం జమీందారీయు. గంజాంజిల్లాలో కొన్ని భాగాలును తొందరపడి అనాలోచితంగా ఒరిస్సా రాష్ట్రమునందు చేర్చివేసిరి. ఒరిస్సాకు తగినంత భూభాగం ఉండాలని అపుడట్లు చేసినా, ఆ విషయం యిపుడు పునరాలోచన చేయాలి. ఒరిస్సారాష్ట్రానికి తూర్పుసంస్థానాలు చాల చేర్చబడినందున, ఆంధ్ర రాష్ట్రంలో చేరవలసిన ఉత్తర మదరాసు భాగాలను యికముందు ఒరిస్సాలో నుంచుకోవలసిన అవసరంలేదు. విశాఖపట్నం గంజాం జిల్లాల మధ్య ప్రాంతాలు ఒరిస్సా రాష్ట్రంలో చేర్చబడినవి. ఒరిస్సా ప్రభుత్వంవారు వాటికి తగినశ్రద్ధ చూపుట లేదు. ఆ ప్రాంతాల నుండి రాదారులన్ని చన్న రాష్ట్రంలోని విశాఖ జిల్లాలోకే యున్నవి గాని, ఒరిస్సా రాష్ట్రానికి పరాసరి మార్గాలే లేవు. కనుక వారు అశ్రద్ధ చేయుటలో ఆశ్చర్యంలేదు. పైగా మన్య ప్రాంతాలను అభివృద్ధి చేయుటకు తగిన ఆర్థికస్థితి ఒరిస్సా రాష్ట్రానికి లేదు. గత పదేండ్లలో చన్న రాష్ట్ర ప్రభుత్వం, మన్యప్రాంతాల మలేరియా బాధ్యం తొలగించి నేల బాగుచేయుటకు అరకు లోయలో పెద్ద ఎత్తున పని చేసిరి. ఆ యత్నం చాల జయప్రదముగ కొనసాగెను. దాన్ని కొనసాగింపవలెను.

#### నాల్గు నదుల సంపద

"ఒరిస్సాలో చేరిపోయిన మన్య ప్రాంతాలు ఆంధ్రరాష్ట్రం ఏర్పడినచో బాగుపడుటయే గాక, యావదాంధ్ర రాష్ట్రాభివృద్ధికి ఆ ప్రాంతాలు ఆంధ్రలో చేరియుండుట అవసరం కూడాను. విశాఖ గోదావరి జిల్లాలలో ప్రవహించు నదులకు నీరు జయపురం జమీందారీ నుండే వచ్చుచున్నది. తూర్పు కనుమలలో పడే వాననీరు పడమరనున్న జయపురంలోనికి పోవునుగాని విశాఖపట్నం పల్లం ప్రాంతాలకు పోదు. గోదావరి నదికి ఉత్తరపు ఉపనదులన్ని జయపురం జమీందారీలోను, దక్షిణ బస్తరు సంస్థానములోను, మధ్య రాష్ట్రములలోని చాందా జిల్లాలోను గలవు. గోదావరి లోయయందును, ఉపనదులు పారే ప్రాంతములందు నీటి పదుపాయములను భూమి సాగును అభివృద్ధిచేసే "గోదావరి వాలీ అథారిటీని" మనం స్థాపింపవచ్చును. గోదావరినది నీరు తగ్గిపోకుండుటకై, ఉత్తరమున నున్న దాని ఉపనదులను కాపాడవలెను. అవి పారుచుండునటువంటి ప్రాంతాల అడవులను కాపాడి, గట్లు కోసే కుండా చూడాలి, రామపాద సాగరం స్కీముద్వారా, విద్యుచ్ఛక్తి ఎక్కువ లభించగలదు. ఆ విద్యుచ్ఛక్తి నుపయోగించి, ఉపనదులు గల ఉత్తర భాగములందలి లోహసంపదనంతా ఉపయోగించి పరిశ్రమల నభివృద్ధి చేయవచ్చును. వాటికి గోదావరి రిజర్వాయరు స్కీము ఒకటే సహాయ పడగలదు. ప్రస్తుత చన్న రాష్ట్రమునందున్న గోదావరి లోయ అభివృద్ధికిన్ని, దాన్ని అంటియున్న ప్రస్తుత ఒరిస్సా మధ్యరాష్ట్రముల ప్రాంతాల అభివృద్ధికి గూడ, రాజకీయ పరిపాలనా సరిహద్దులను నిర్ణయించుట అవసరం.

ఆంధ్రరాష్ట్ర ఆదాయం, జనాభా

యుద్ధానికి పూర్వం చెన్న రాష్ట్రం

